# వివేకానంద గీతావళి

గ్రంథకర్త

కడియాల సుబ్బన్నశాస్త్రి

ప్రచురణ:

రామకృష్ణా గ్రంథమండలి.

20/390, ఏలూరు రోడ్డు,

విజయవాడ.

బెజవాడ, ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె

1949

{ వెల. రు. 1-0-0

# అభినందనము

బ్రహ్మశ్రీ కడియాల సుబ్బన్న శాస్త్రిగారు వ్రాసిన వివేకానంద గీతావళి, అను గ్రంథము నామూలాగ్రముగాఁ జూచితిని. రామకృష్ణ పరమహంసయెడలను, వానిశిష్యుఁడగు వివేకానందుని యెడలను, నాయిరువురి బోధలయెడలను నీ కవివర్యులకుఁగల గాఢానురాగము నీగ్రంథము వెలయించుచున్నది. మహాపండితులకు సైత మగమ్యములగు మహాత్తర వేదాంత విషయములను స్త్రీ బాల వృద్ధముగ నందఱును జదువుకొనుట కనువగునట్లుఁ దేఁటతెల్లమొనర్పఁగల వీరిలేఖిని కొనియాడఁదగినది. ప్రథమ ప్రయత్నమగుట ధార యెడనెడఁ గొంచెము కుంటువడినను మొత్తముపై మెచ్చుకోలునకుఁ దగ్గది. పెద్దవిషయమును జిన్న మాటలలో సులభగ్రాహ్యముగఁజెప్పెడునట్టిదియే నవయుగమున ముఖ్యముగాఁ గవులకు వలయు సామర్థ్యము. అట్టి సామర్థ్యము వీరిలో మెండుగాఁ గన్పట్టుచున్నది. ఇట్టి వేదాంతవిషయిక గ్రంథములనురచియించుటకు వలయు నాయురారోగ్యైశ్వర్యాదులను భగవంతుఁడు వీరికిఁ బ్రసాదింపవలెనని కోరుచున్నాఁడను.

గొడుగుపేట.<br>
మచిలీపట్టణము<br>
14—6—49,

అద్దేపల్లి లక్ష్మణస్వామి.

శ్రీరామకృష్ణ పరబ్రహ్మణే నమః

శ్రీవివేకానందాయ నమః

# శ్రీ వివేకానంద గీతావళి

—:ప్రశంస:—

సీ. శ్రీకృష్ణ భగవాను శేముషీవిభవంబు
శ్రీరామ చంద్రుని శీలపటిమ
బుద్ధ దేవునియొక్క బోధనాపద్ధతి
శంకరాచార్యుని జ్ఞానదీప్తి
ప్రహ్లాదబాలుని భక్తిప్రభావంబు
శ్రీకృష్ణచైతన్య చిద్విలాస
మంజనాతనయుని యమలసేవాసక్తి
క్రైస్తవమహనీయు కరుణబోధ

తే గీ. ఇట్టియోగ్యత లెన్నియో పట్టువడఁగ
రామకృష్ణ పరమహంస సేమమలర
నవతరించెను జ్ఞానియై యవనియందు
సర్వమతముల సారంబు చక్కఁబఱుప.

శ్రీ డా గీ త ము

ఆ. గీ. ఆతని ప్రియశిష్యుఁ డా వివేకానంద
దేవుఁడున్న యెడలఁ దెలియఁగా వ
తెనను దీక్షగలిగి మనమునఁ జింతించి
గురునిబోధ వినఁగఁగొనెను దీక్ష.

తే. గీ. ఆంధ్ర గీర్వాణ భాషల నభ్యసించి
సకలశాస్త్ర పురాణము ల్చదివి చదివి
వేద వేదాంతములనెల్ల విశదముగను
దనివితీరఁగ నర్థంబు దఱచితెఱచి

తే. గీ. మతములన్నిటి సారంబు మదినెఱింగి.
గురువుచేసినబోధను బరులకెల్ల
నిరుపమాన సుధాధార నెఱుకఁ జేయ
దివ్యసుందరమూ ర్తియై తేజరిల్లి

తే. గీ. దేశదేశముల్ తిరిగి యుత్తేజమలర
మధుర గంభీర వాక్కులు మదినినాట
గురుని సందేశమును దెల్పఁ గోర్కెమీర
భారతావని పృథ్విలో వన్నె కెక్క.

ఉ. బాహ్యప్రపంచ జీవనమె పావనమంచు యథార్థ తత్వముల్
గ్రాహ్యముగాక భోగముల కాలము వ్యర్థముచేయుచుల్
సదా
యేహ్యతతోడ హిందువుల నెప్పుడునుం గను నన్య
జాతులల్
సహ్యత గల్గి చూచెఁగడు శాశ్వతమైన పథంబుఁజూపియున్.

తే. గీ. అమెరికా ముఖ్య పట్టణ మందు నాడు
సకల మతబోధకుల సభ సాగియుండ
హైందవ మతబోధకుఁడు గా నచటి కేగి
వేద వేదాంత సారంబు విశదపఱచి

తే. గీ. యన్ని మతముల సారంబు నదియ యనుచు
గాంధికపుఁ బ్రమాణమ్ములు గ్రాహ్యపఱచి
జీవసేవయె పరమార్థసేవ యనుచు
నాత్మ పరమాత్మ ప్రతిబింబ మనుచుఁ దెలిపి

తే. గీ. జనుల హృదయ సీమలయందుఁ జక్కనైన
స్వేచ్ఛ చక్కగ నెలకొల్పి భీతిమాన్పి
దీన భావంబు విడనాడి తేజమలర
సచ్చిదానంద మూర్తులై జనులు భువిని

తే. గీ. జీవయాత్రను గడుపుట శ్రేయమనుచు
బోధచేసెను సభ్యు లామోదమంద

చ. అరిగియు దేశదేశములయందలి పల్లెలఁ బట్టణంబులన్
దఱుగని వేదసూక్తులు సదా వెదచల్లుచు సజ్జనావళిన్
గరముఁ దరింపఁ జేసియు సఖావళితోడను శిష్యకోటితోన్
మఱలెను మాతృభూమి కసమాన యశంబుఁ గడించి
వేడ్కతోన్.

ఉ. భారతభూమియందు మతభావము లెన్నియుఁ దారుమారులై
క్రూరముగా జనంబు కులరోషముతోఁ గలహించుచుండఁగా
వారికి సత్యముం దెలుప వాదనఁ జేసియు బోధఁజేసియున్
సారముఁజూపి వేదముల శాంతినిఁగూర్చె వివేకనందుఁడున్.

తే. గీ. స్వామి యాంగ్లభాషను వ్రాసెఁ బద్యములను
వానిఁ గొన్నిటిఁ దెనిగించి వ్రాసినాఁడఁ
దేట గీతములో వానిఁ దేటపడఁగ
భాషయందలి దోషము ల్పాటిగొనక
భావములను గ్రహింప మత్ప్రార్థనంబు.

తణుకు
1– 2– 43

కడియాల సుబ్బన్నశాస్త్రి
రిటైర్డు, బోర్డుహైస్కూలు టీచరు. తణుకు

# నిర్వాణషట్కము

(క్రీడా గీతములు)

మనసునేనుగాను మఱి బుద్ధియునుగాను
అహముగాను చిత్త మఱయ్యఁగాను
మేనుగాను నేను మేని మార్పులుగాను
శ్రవణ జిహ్వా ఘ్రాణ చక్షురింద్రి
యములు గాను వాయు వాకాశ మగ్నియు
జలము పృథ్వీభూత చయముగాను
ఆత్మ నేనె సచ్చిదానంద మూర్తిని
నేనతండ నతఁడునేన సుమ్మి!! (శివోహం శివోహం) 1

(క్రీడా గీతములు)

ప్రాణశక్తి పంచ ప్రాణశక్తులుగాను
దేహ వస్తువులను దేనిగాను
కోశ పంచకంబు లేశమైననుగాను
జ్ఞానకర్మలకును సాధ్యపడను
తలపనేను సచ్చిదానంద మూర్తిని
నేనతండ నతడు నేనె సుమ్మి!! (శివోహం శివోహం.) 2

(గీతమాలిక)

విముఖ సుముఖత్వ భావము ల్వైదుక లేవు
అహ మనూయత గుణములు నఱయ లేవు
ధర్మ మోక్షమార్గములును దఱికిరావు
కోర్కె నేనుగాను మఱియు కోర్కెదీర్చు

వస్తు సముదాయమును గాను వాస్తవముగ
సచ్చిదానంద మూర్తినై జగతియందు
వెలయుచుంటిని గాంచు డో విబుధులార!
నేనతండను నాతండు నేనెసుమ్మి!! (శివోహంశివోహం)3

(గీతమాలిక)

పాప పుణ్యంబు సుఖదుఃఖ భావములును
దేవళంబును బూజయు దేశయాత్ర
గ్రంథ రాజంబు లేవియు గాను నేను
భోగమును భోగవస్తువు భోగ కర్త
వీరియం దెవ్వరినిగాను వెదకిచూడ
సచ్చిదానంద మూర్తినై జగతియందు
వెలయుచుంటిని గాంచు డో విబుధులార!
నే నతండను నాతండు నేనెసుమ్మి!!(శివోహంశివోహం)4

(గీతమాలిక)

లేదుమృత్యువు నాకెప్డు లేదుకులము
మరణ భయమును శూన్యంబు మదినినాకు
జన్మ లేదు నాకెప్పు డీ జగతియందు
తల్లిదండ్రులు మిత్రులు దలప లేరు
చుట్టములు గూడ నెచ్చటఁ జూడ లేరు
గురువు శిష్యులు నాకెందు గూడ లేరు
సచ్చిదానంద మూర్తినై జగతియందు
వెలయుచుంటిని గాంచు డో విబుధులార!
నేనతండను నాతండు నే నెసుమ్మి!!(శివోహంశివోహం) 5

(గీతమాలిక)

ఇంద్రియంబులు నన్నంట వెపుడు సుమ్మి
ముక్తుఁగాను నేనెవరికి బోధపడను
హద్దురూపముల్ నాకెప్డు నద్దులేవు
కాల మావరణలు నన్నుగట్టలేవు
అన్నివస్తువులందు నే నమరియుంటి
జగతి కాధారముగ నేను జాలియుంటి
సర్వమును నిండియుంటిని జగతియందు
సచ్చిదానంద మూర్తినై జగమునందు
వెలయుచుంటిని గాంచు డో విబుధులార!
నేనతండను నాతండు నేనెసుమ్మి!!(శివోహం శివోహం)6

యతీశ్వరుని గీతము

(గీతమాలిక)

కామకాంచన కీర్తులఁ గాంక్ష దెల్పు
వేడినిట్టూర్పు లెచ్చట వినగలేమొ
జ్ఞాన మానంద సత్యము ల్సరసగతిని
బాఱుచుండునో సెలయేటి తీరునెపుడు
సాంద్రకాంతారసీమల సందునఁ గడు
వ్యాప్తిఁజెంది నట్టి చదును బయలులందు
గాలిచొఱనట్టి పర్వత గహ్వరముల
లోకరోదన వినరాని లోకమందు

శాంతినేల కొన్నయట్టి యాపాంతములను
నిట్లు గానంబు వినబడె నట్లుగాన
హెచ్చు గాత్రంబుతో ధృతి పెచ్చు పెఱుగఁ
దాపసోత్తమ! ఓమ్తత్సదనుచు బాడు. 1

(గీతమాలిక)

తుంచివేయుము నిన్ను బంధించుగొలుసు
లను మెఱుఁగు పసిఁడివిద్మైన నినుపవైనఁ
బ్రేమయు నసూయతయు నింకఁ బెక్కు-మంచి
చెడ్డ జంటగుణంబులు చివరకెప్పుడు
బంధ కారణములగుచు బాధఁగూర్చు
దాను బానిసగా నెంచుమానవుండు
నిజముగా బానిస యగుట నిశ్చయంబు
శిక్షరక్షణ వానికి స్వేచ్ఛనీవు
పసిఁడి గొలుసు బంధింపఁగ బలముతక్కు-
వనుచు నెంచియు నద్దానినంతవిడువ
కూడదు మనము ఖండింపకుండ నెప్పుడు
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చు పెరుగఁ
దాపసోత్తమ! ఓమ్తత్సతనుచు బాడు. 2

(గీతమాలిక)

అంధకారము నీయందు నంతమంద
జ్ఞానభానుని వెలిగించు మానసమున
జ్ఞానియగు సద్గురువు నీకుఁ జాలినంత
జ్ఞానమిడి యంధకారము సమసిపోవఁ

దగినసాయంబుఁ జేయును దారిఁజూపి
జ్ఞాన శూన్యుఁడు గురువైన సరిగనిన్నుఁ
గొఱివి దయ్యము రీతిని గొఱివిఁజూపి
కటికచీఁకటి లీడ్చును కరుణ లేక
జననమొందినపిమ్మటఁ జావుగల్గి
మఱల జన్మంబుగల్గుట మఱువవలదు
జీవునకు జన్మహేతువు జీవితంబు
జీవితాశను సంతృప్తిఁ జేయు మీవు
ఆహముఁగెల్వఁగ నన్నియు నంతరించు.
లోనుగాకుము దేనికి దీనిఁదెలిసి
హెచ్చుగాత్రింబుతో ధృతి పెచ్చు పెరుగఁ
దాపసోత్తమ! ఓమ్తత్సదనుచు బాడు. 3

(గీతమాలిక)

విత్తులను జల్లు నాతడె పొత్తుదీయు
గారణము ఫలమును నిచ్చి తీరవలయు
మంచి ఫలితము దెచ్చును మంచికర్మ.
చెడ్డకర్మము తెచ్చును జెడ్డఫలము.
ధర్మమును దప్ప నేరికి దరముగాదు
జీవుడు శరీరమును ధరించిన నతండు
బంధమునుగూడ ధరియింప వలయు ననుచుఁ
బల్కిరి ఋషులు మున్నది వాస్తవంబు
ఆత్మనామ రూపంబుల కవలనుండు.

స్వేచ్ఛతోఁగూడి యెప్పుడు స్థిరముగాను
అదియెనీవని తెలిసియె హాయినొందు.
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుఁబాడు. **4**

(గీతమాలిక)

తల్లిదండ్రుల బిడ్డలఁ దలచుచుండు
భార్యమిత్రులప్రేమను బడయుచుండు
వ్యర్థమగు కలలఁ గనెదు వ్యర్థులెపుడు
సత్యమును గాంచనేరరు జగతియందుఁ
దండ్రి యెవ్వరికాతఁడు దలచిచూడ?
బిడ్డ యెవ్వరికాతండు పెంచిచూడ?
నాతఁడెవ్వరిమిత్రుఁడు ప్రీతిఁజూడ?
నెవనిశత్రువాతం? డొక్కఁడె యయియుండ
నన్నిజీవకోటులయందు నాత్మయొక్కఁడె
గాన నితరమేదియు లేదువానికంటె
నతఁడె నీవని తెలియుము హాయిపొంద
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చుపెఱుగఁ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుఁబాడు. **5**

(గీతమాలిక)

స్వేచ్ఛగలిగి యొకండె నిజేచ్ఛ గలడు
అతఁడె నామరూప రహితమైన యాత్మ
అతఁడె పఱగును జ్ఞాతగా నతనియందె
మాయయనునది పొడగట్టు మఱియుఁగూడ

స్వప్నతుల్యమతనికి నీ జగతియగుట
నతఁడు దానికి సాక్షియై యలరుచుండె
నతఁడె ప్రకృతియు జీవాత్మలగుటఁ దోచు
నతఁడె నీవని తెలియుము హాయినొంద.
హెచ్చుగాత్రంబుతో ధృతిపెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుబాడు. 6

(గీతమాలిక)

నీవుగోరిన స్వేచ్ఛను నిజముగాను
నెట్టిలోకమైననుగాని యిద్దిగాని
యిడఁగఁజాలదు నీకంచు నెంచుమెపుడు
గ్రంథములు దేవళంబులు గడకు నీకు
నిడఁగఁ జాలవు స్వేచ్ఛ నోకించుకైన
నీవు పట్టిన బంధమే నిన్నులాగు
విడువఁ బట్టును దుఃఖంబు విడుచునిన్ను
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుఁబాడు. 7

(గీతమాలిక)

శాంతి గలిగి యుందురుగాక జనులు భువిని
నన్యజీవికి నేనెప్డు హానిజేయ
నూర్ధ్వ పాతాళలోకము లుండుచోట్ల
గలవు జీవకోటులు పెక్కు కడకు నందు
నుండు నాత్మయు నేనుగా నుంటసుమ్మి

స్వర్గ పాతాళ మర్త్య ప్రపంచములను
నట్టి లోకజీవితముల నెట్టివైచి
యాశ భయముల రెంటికి నావలుంటి
ననుచుఁ బలుకుము నీ వెప్డు హర్ష మొప్ప
బంధములఁ ద్రుంచి వేయంగఁ బాటుపడుము
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చు పెరుగఁ
దాపసోత్సమ! ఓమ్ తత్సదనుచుఁ బాడు. 8

(గీతమాలిక)

దేహ మావశ్యకము నీకు దీరిపోవ
జావు బ్రతుకుల నీ వప్డు సరకుగొనవు
మించినను గర్మ దానిని మెచ్చుగాక
పూజచేసిన దానిని బొగడుచున్న
దన్ను చుండిన దానిని దగదటంచు
నొరునితో బల్కకుండుము మీ! ఓర్పుగలిగి
పొగడఁ బడు వాఁడును మఱియుఁ బొగడతయును
భూషణకుఁ దగువాఁడును భూషణయును
నొక్క యాత్మయేగాని వేరొకటి లేదు
దూషణయు భూషణయు గూడ దుదకునొక్క
దేహమునకు జెందునుగాని తెలిసికొనగ
నాత్మ కెప్పుడుఁ జెందదనినగును జుమ్మి
కాన శాంతితోడను ముక్తి గాంచుమీవు
హెచ్చు గాత్రంబుతో ధృతి పెచ్చు పెరుగ
దాపసోత్తమ! ఓమ్తత్సదనుచు బాడు. 9

గీతమాలిక

వాంఛ కామము కీర్తి యువతులచోట
స్థానమే లేకయుండును సత్యమునకు
స్త్రీని భార్యగా నూహించు మానవుండు
భువిని పరిపూర్ణభావంబుఁ బొందలేడు
తనది యనఁదగు వస్తు వీ ధరణియందు
నెంత కొంచెముగానున్న నంతవఱకు
గ్రోధ మతనిని బంధించి కృంగదీయు
నపుడు మాయను దాటలే డతడు సుమ్మి!
గానదానిని విడనాడఁబూనవలయు
హెచ్చుగాత్యాగబుతో ధృతి పెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్తత్సదనుచు బాడు. 10

(గీతమాలిక)

గృహమనునది నీకుండినకీడుగల్గు
నెట్టుగేహము నీ కిరవీయఁజాలు?
పసిరిక తలంబె మెత్తనిపాన్పునీకు
నాకసము నీకుఁ గప్పుగా నమరియుండు.
నుడికిన నుడకకున్నను నూరక లభి
యించునది నీకు నాహారమంచుఁగొనుము!
తన్నుదాను దెలిసికొనఁదగినదగుట
నాత్మఘనమైనదగుచు నొప్పారునెపుడు
దాహ మాహారములు దానిదరికిఁజేరి
దానిలేశముఁ జెరుపంగఁబూనలేవు

ఏఱుపాఱెడువిధమున నెపుడునీవు
స్వేచ్ఛతోఁగూడి విహరించు పృథ్వియందు
హెచ్చుగాత్రంబుతో ధృతిపెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుబాడు. 11

(గీతమాలిక)

స్వల్పసంఖ్య గలజనులుసత్యమరయఁ
గలరుగాని యితరులు నిన్నలసభావ
ము గలిగి పరిహసింతురుమూర్ఖులగుచు
గాని మహనీయుడవు నీవు గానదానిఁ
కెట్టిలక్ష్యముఁజూపకు మెపుడుఁగూడ
జనులు వసియించుచోట్లకు జనియు నీవు
వారి యఁధకారంబును వమ్ముజేసి
జ్ఞానమిచ్చియు వారికి సాయపడుము
స్వేచ్ఛనొందినవాఁడవై చింతలేక
బాధవలని భయములేక పడయు విషయ
భోగములను వాంఛయులేక పూర్తిగాను
వీని రెంటికి దూరమై వెడలిపొమ్ము.
హెచ్చుగాత్రంబుతో ధృతి పెచ్చుపెరుగ
దాపసోత్తమ! ఓమ్‌తత్సదనుచుఁబాడు. 12

(గీతమాలిక)

కర్మశక్తులు క్రమముగా ఖర్చుపడగ
స్వేచ్ఛ నాత్మకుఁ జేకూర్చుఁ జివరవఱకు

జన్మయనునదిలే దెప్డుజగతియందు
నేను, నీవును, దేవుడు, మానవుండు.
నిజముగాలేమనుచు నెంచు నిశ్చయమ్ముగ
నేనె యంతయునైతిని నిజముగాను
నేను గానంతయును గూడఁగానఁబడును
అంత నానందరూపమై యలరుచుండు
నదియె నీవంచుఁదెలియుము హాయినొంద
హెచ్చు గాత్రంబుతో ధృతి పెచ్చుపెరుగఁ
దాపసోత్తమ! ఓమ్తత్సదనుచుఁబాడు. 13

## శాంతిగీతము

(గీతమాలిక)

అదిగో! చూడుము దాని యనంత బలము
శక్తిగాదది మఱి మహాశక్తిగాని
కటికి చీకటిలో నుండు కాంతియదియె
అమితకాంతిలో నుండెడు తిమిర మదియె
వెల్లడికి రాని యానందవేళ మదియె
అనుభవింపఁ బడని దుఃఖ మదియెసుమ్మి
జీవితముగాని శాశ్వత జీవితమదె
ఏడ్వఁబనిలేని మరణము నెంచనదియె
దుఃఖ మానందమును గాదు తుదకునదియుఁ
వాని రెంటికి మధ్యను వఱలునదియుఁ
బవలు రేయియుఁ గా దదివాస్తవముగ
వాని రెంటికి సంధియై వఱలుచుండు

గానమునకు మాధుర్యము కలుగఁజేయు
నట్టి విశ్రాంతిగా నుండునదియు దలపఁ
బావనమగు కళకు మధ్య వాస్తవమగు
నావిరామ మనునదియె యదియు నగును.
అద్దిసంభాషణ సమయమందు మధ్య
గలిగెడు విరామమని యెంచవలయు నెపుడు
విషయ వాంఛ ఫలము నొందు వేళఁ గలుగు
హృదయ శాంతియు నూహింప నదియెసుమ్మి.
కాంచ లేనట్టి యందముఁగడకునదియె
ఒంటరిగనుండు ప్రేమగానొప్పునదియె
పాడ బడనట్టి మృదువగు పాట యదియె
తెలియ బడనట్టి యజ్ఞాన తేజ మదియె
రెండుజీవితముల మధ్య నుండునట్టి
మృత్యువనునది యద్దియే సత్యముగను
రెండగు తుపానులకు మధ్య నుండుశాంతి
యదియె పరికింప పూర్తిగా నవనియందు
దేనినుండి సృష్టిగలుగు దేనియందు
నది లయముగాంచునట్టి శూన్యంబునెంచ
నద్దిగా నుండు నూహింప నవనియందు
నిర్మలానంద రూపము నెగడునటుల
దేని నశ్రుబిందువు చేరు దానిఁ దలఁప
నద్దియేయంచుఁ దెలియుంగనగును సుమ్మి
జీవితమునకు గమ్యము చివర కదియె
శాంతియే దానినిలయము సత్యముగను

# శ్రీ రా మ కృ ష్ణు ని దై వ త్వ ము

(గీతమాలిక)

లోకపూజ్యుఁడవగు దేవ! నీకు మేము
వందనము లిడుచుంటి మీా వందుకొనుము
వాస్తవంబుగ సంసార బంధములను
ఖండనముఁ జేసియున్నట్టి ఘనుఁడ వీవు
నిష్కళంకుఁడ వీవును నిశ్చయముగ
దైవ లక్షణ మూర్తివై తనరుదీవు
గుణముల కతీతుఁడవు నీవుగూడ నౌదు
మానవాకృతిఁదాల్చి యీ మహిని నీవు
వెలయుచుంటివిగాన నీ యిలను నీకు
వందనములిడి భక్తితో నందఱమును
పూజ గావింతుమయ్య! యో పూతచరిత! 1

(గీతమాలిక)

వాక్కు మనసును నీ ప్రాపు వడసియున్న
వాని రెంటి కతీతమై వఱలు దీవు
కాంతియే నీవు కలవీవు కాంతియందు
హృదయగహ్వరమనునది యెపుడుఁగూడ
నీవు దర్శనమిచ్చిన నిక్కముగను
గాంతిమంతముగా నుండఁగలుగు నెపుడు
నరుని గాఢ మజ్ఞాన తిమిర మెపుడును
నీవె పాఱఁదోలఁగలవు నిక్కముగను. 2

(గీతమాలిక)

ప్రొద్దుక్రుంకెడు వేళలఁ బూజసలుపు
సమయమునను నీ భక్తులు సరసగాను
తాళ వాద్య మృదంగ సమ్మేళనంబుఁ
జేసి యైక్య కంఠముతోడ వాసి నచట
భక్తిరసము నలుగడలఁ బొంగుచుండ
మధురగానముఁజేయుచు మనుజులెల్లఁ
బరవశత్వముఁ జెందఁగఁ బాడుచుంద్రు. 3

(గీతమాలిక)

జ్ఞానమను నంజనముచేత సత్యముగను
నిర్మలతఁ జెందు నీ దివ్య నేత్రములను
గాంచ నొకసారి మాయయుఁ గడకుఁ దొలఁగు
పాపములను బోఁగొట్టెడు వాఁడ వీవె
స్వచ్ఛమై నిర్మలంబగు జ్ఞానమగుచు
నుండు నీ స్వరూపము వెల్గుచుండు భువిని
సహజమై స్వయమగు ప్రకాశమును గల్గి
వెల్గుచుండును నీ యాత్మ పృథ్వియందు
దైవభక్తికి నున్నత భావములకు
సాగరమువంటి వాఁడవు సత్యముగను
పావనంబగు నీ పాదపద్మములను
బొంది నీ భక్తులగువారు పూర్ణముగను

సార రహితమౌ సంసార సాగరమును
సేమముగ దాట యత్నంబుఁ జేయుచుండు. 4

(గీతమాలిక)

ఓ జగత్ప్రభూ! నీయొక్క యోగమాయ
యందు నీప్రపంచమున నీ వవతరించి
గొప్పగా వెల్గుచుంటి వీ విప్పగిదిని
మేము జీవించియుండగా మేలుగాదె?
ఇంద్రియముల జయించియు నిహమునందు
నీవు మహనీయ మూర్తివై నెగడుచుంట
నీ కృపవలన మాత్రమే నిజముగాను
మా మనస్సు సమాధిలో మగ్నమగుటఁ
గాంచఁ గల్గుచుంటిమి మేము కడకు నెపుడు
కరుణయేయగు నీ మూర్తి కఠినమైన
పనులు నీయవిగాఁ గానఁబడునుగాదె?. 5

(గీతమాలిక)

దుస్థితి వినాశముల కీడుఁ దొలఁగఁజేసి
కలియుగమునందు జనులను గట్టివైచు
కర్మబంధముల నణఁకి కడకు వారి
నెల్లరనుగూడ రక్షింతు వీవుగాదె?
జీవితంబును త్యాగముచేసి నీవు
స్వేచ్ఛ నిడుదువు జనులకు వృథ్వియందు

నో జగద్రక్షకా! పురుషోత్తముడవు!
త్యాగమూర్తి పరమహంసగాఁగ నీవు,

(గీతమాలిక)

స్త్రీ పురుష భేదభావముఁ జెప్ప నున్న
సొత్తు భావము నీయందు శూన్యమయ్యె
భోగములు నీకు నిందార్హ్యములుగ నుండె
గాన నీ పావన పదములైన వాని
యందు గాఢభక్తిని మేముపొందఁగల్గు
దారి మాకును జూపుము త్యాగమూర్తి! 7

(గీతమాలిక)

నీకు సహజగుణంబగు నిర్భయంబు
సందియము లన్నియును నీకు సమసిపోయె
నీమదియు నిశ్చయత్వము నిలిపికొనును
నిన్ను ప్రేమించు భక్తులు నిశ్చయముగ
హేతువాదము దాటియు నెపుడుఁగూడ
నధికభక్తిని గల్గియు నలరుచుంద్రు
జాతి వంశము కీర్తియు సాటిలేని
పేరువలనను గర్వము పెచ్చుపెరుగ
భక్తు లెప్పుడు దానిని బాఱఁదోలి
శరణుఁ జొత్తురుగాదె? యో పరమహంస! 8

(గీతమాలిక)

పావనమగు నీ పదములే వాస్తవముగ
నుండె నాకొక నిధివలె నొప్పుగాను

దానిఁ జేరంగ జగమెల్లఁ గానుపించు
గోవు డెక్కచే నేర్పడు గుంటయందుఁ
జేరు నుదకంబు రీతిని జివఱ కెపుడు. 9

(గీతమాలిక)

ప్రేమకు వరప్రసాదంబ వీవుగాదె
సకల మానవులందును సరిసమాన
మైన తత్త్వము గనుచుండు నతఁడ వీవె
నాశనముఁజెందు లోకమునందునుండు
బాధ చెడుగులు నీయందుఁ బతనమగుచు
నాశనముఁ జెందు నో పరమేశ! కడకు. 10

## దైవమాత

(గీతమాలిక)

దివ్యసుందరమూర్తి వౌ దేవి! నీవు
కష్ట సుఖముల రెంటి నీ కరములందుఁ
బట్టియుంచితి వమ్మ నో! గట్టిగాను
మంచి కూర్చుచు నుందువు మానవులకు
నెవరివో నీవు? దెలియంగ నెవరివశము?
నునికి యను జలార్ణవమందు నుండునట్టి
బలమగు కెరటములు లేఁచి పైకి సుడుల
తోడ నూఁగులాఁడుటఁ గాంచఁ దుదకు నంత
నీవలన జరుగుచుండును నిజముగాను
చెదరియున్నట్టి జగతిని జేర్చి మఱల

నెడ తెలుపి లేక యిట్టుల నెపుడుఁగూడ
నీవు పనిఁ జేయుచుందువు నిజముగాను. 1

(గీతమాలిక)

భూతకర్మల ఫలితము భువినిఁ గల్గు
జను లనుభవింప వారికి సరిగ నీవు
పంచుచుందువు యోగ్యతఁబట్టి యెపుడు
భావికర్మలఁ జేయఁగఁ బద్ధ తేదియొ?
వారలకుఁ దెల్పుచుందువు వాస్తవముగ
నీకు విశ్రాంతి యుండునే నిజముగాను?
నేను నీ పుత్త్రుఁడ నగుట నీవు నాకు
దీవన లిడుచుఁ బ్రోవుము దేవి! యెపుడు
కర్మపాశములను నీవు కరములందుఁ
బట్టియుంచితి వంచు నే గట్టిగాను
నెఱిఁగి యనుభవించుదు నమ్మ! యెపుడుఁగూడ. 2

(గీతమాలిక)

మూలశక్తియో? యది సృష్టి మూలమైన
వస్తువనునది కాదేమొ? వాస్తవముగ
దైవ లిఖితమో? ముందుగాఁ దలపలేని
ఫలిత మేదైన నగునేమొ? పలుక దాని
నదియు లేకున్న నేది యీ యవనియందుఁ
దెలియఁబడకుండు నెప్పుడుఁ దేఁటపడఁగ?
చంచలము లేని చిత్తమే సరిగ దాని
సూత్రములను దెలిసికొను సూటిఁ దెలిసి

యట్టి మూలశక్తియు నాకు నాశ్రియంబు
నిచ్చి రక్షించుఁగావుత మెపుడుఁగూడ.

(గీతమాలిక)

తన మహిమమును జగతిలో ఘనతనొప్పఁ
బెక్కుగు నవతారములను బృథ్వియందు
నె త్తె నామెయుఁ దనశక్తి యినుమడింపఁ
జావు పుట్టువులను గల్గు సాగరంబు
పొంగి పొరలఁగఁ జేసెడు ముఖ్యమైన
శక్తులనుకల్గి మార్పు లేశంబు లేని
దానికిని మార్పుఁ గల్గించి తత్క్షణమున
మార్పుగలవానికిఁ దిఱుగ మార్పుఁ దెచ్చి
యేకమును జేయు శక్తియె యెపుడు నామె
గాన నామెయందునుగాక వేనియందు
మనము శరణుఁ జొత్తుము లోకజననియగుట.

(గీతమాలిక)

శత్రుమిత్రులఁ జూతువు సమముగాను
భాగ్యవంతులకుఁ గడు నిర్భాగ్యులకును
బ్రాణము నొసంగు నీ స్పర్శ ఫలమునిచ్చు
నెపుడు సమముగా భేదము నెంచకుండ
మృత్యు వుండుట మృత్యులేమియునుగూడ
నీ కటాక్షము తల్లిరో ! నిజముగాను
నేను నీ పుత్త్రుఁడనుగానె నిజముగాను?
దయను వెలిబుచ్చు నీమోము దాచకుండ
నాకుఁ జూపుచు నుండు మో లోకజనని!

(గీతమాలిక)

ఎట్టిదానవో? నినుఁగూర్చి యెఱుఁగలనేను
పూర్తిగాఁ బల్కఁ గలుగుదుఁ బొల్లులేక?
తలఁప నాగ్రహింపగ శక్తి తక్కువగుట;
జగతినంతను పోషించు జననివగుట
నిన్ను నా కరములఁబట్ట నెన్నఁడైన
సాధ్యమగునొకో! యత్నింపఁ జాలియున్న
నిర్భయత్వమునకు నెప్డు నిలయమైన
శ్రీమహాలక్ష్మి నినుఁ జేరి సేవఁజేసె
నట్టి పావన పదముల నాశ్రయింతు.



(గీతమాలిక)

జననమాదిగ నాకామె సాయపడుచుఁ
గష్టములనుండి నను జేర్చె గమ్యమునకుఁ
దల్లివలెనామె చక్కఁగాఁ దగినరీతి
నాట పాటలతో జ్ఞాన మబ్బునటుల
సమధికోత్సాహమయజీవితమును గూర్చె
నేనుఁ జేసిన కృషికిని నిజముగాను
దగిన ఫలితము గలిగిన తరుణమందు
నదియు గల్గకయున్నను నామె నాకు
దల్లియోయగు నామె యే తప్పదింక
శరణ మగును నాకెపుడు నీ జగతియందు.

# కాళి (జగన్మాత)

(గీతమాలిక)

కానఁబడకుండెఁ దార లాకాశమందు
మేఘములు గప్పివైచెను మేఘములను
గాలి సుడులతో నిండియుఁ గలఁతఁ జెందె
హోరుమనుచు ధ్వనియొకటి యుద్భవిల్లె
గాఢతరమైన చీఁకటి క్రిమ్మె దిశలఁ
బిచ్చివారగు జీవులు పెచ్చుపెరిగి
బందిఖానను వీడియు బయటఁ బడెడిఁ
బెల్లగిల్లెను వృక్షము వ్రేళ్లతోడ
గొండలను బోలు కెరటము ల్గోలసేయ
మింటి కెగయుచు నుండఁగ మితిని మించి
సాగరముఁగూడఁ జేరెను సంగరమున
తెలుపు పసుపు వర్ణములతోఁ దేజరిల్లు
కాంతి యొక్కటి నలుగడ క్రుమ్మివైచె
ప్లేగు మొదలగు వ్యాధులఁ బెక్కుగూర్చి
మృత్యుదేవత రూపులు మితినిమీఱ
నిలను బెక్కు దుఃఖములతో నిలుపునామె
నృత్యమును సల్పుచుండియు నిజముగాను
పిచ్చి యానందమునుగూడి భీతిఁగొల్ప
రమ్ము తల్లిరో! నీవిప్డు రమ్ము వేగ

(గీతమాలిక)

భయమె నీ నామముగనొప్ప వసుధయందు
నీకు మృత్యువు శ్వాసగా నెగడుచుండుఁ
జలనయుతమగు నీ యడుగు సంహరించు
జగతి నంతను బూర్తిగా శక్తిఁజూపి
కాలరూపి వినాశనకారి వీవు
రమ్మ తల్లిరో! నీ విక రమ్మ వేగ. 2

(గీతము)

నెవఁడు ప్రేమించు దుస్థితి నెప్డుఁగూడ
నెవఁడు మృత్యుదేవతఁ గౌఁగిలించు వేడ్క
నెవ్వఁ డామెతో నృత్యము నెపుడు సల్పు
నతఁడె దేవిని దర్శింప నర్హుఁడగును. 3

## శివ స్తోత్రము

(గీతమాలిక)

వందనము సేయుదును శివు భక్తితోడ
నతని మహిమను గొనియాడ నలవిగాదు
అతఁడె సృష్టి స్థితి లయము లన్నిఁటికిని
గారణంబగుచు జగతిఁ గాంచుచుండు
శివుని యందలి భక్తి చే జీవితంబుఁ
గడుపుచుంటిని నే నెప్డుఁ గౌతుకమున
నంతకును దాను ప్రభువుగా నలరుచుండి
దాని నంటక సాక్షియై తనరుచుండు. 1

(గీతమాలిక)

ప్రభువనెడు నామమొప్పియు వఱలు నతఁడు
భ్రాంతిని దొలగఁజేసెడి ప్రభువతండు
అమిత వాత్సల్య నిలయమై యలరుచుంటఁ
బేరు లన్నిటిలో మంచి పేరుగాంచి
తేజమొప్పగ నా మహాదేవుఁడయ్యె
నతఁడు ప్రేమమూర్తి యగుచు నలరుచుంట
గాఢ భక్తిచే వానిని గాఁగిలింప
హరుని హృదయమునందు నా పరమశక్తి
స్వప్నతుల్యముగాఁ దోఁచు సహజముగను. 2

(గీతమాలిక)

మేటి కెరటములనుగూడు నీటివలెను
పూర్వజన్మ కర్మ ఫలము ల్పొంగివాని
శక్తులు హృదయమున గొప్ప చలనముగలి
గించుచుండును, దానియం దెంచిచూడ
నీవు నేనను వ్యత్యాస భావముండు
చంచలమగు మానసము విశ్రాంతిఁ జెందు
నట్టి శాంతమూర్తికి నేను కట్టకడకు
వందనం బాచరింతును భక్తితోడ
నతఁడు శివుఁడు మహాదేవుఁ డగునుగాక. 3

(గీతమాలిక)

తల్లి దండ్రులు, బిడ్డలుఁ దలఁప మఱియు
నిర్మలంబగు నూహలు నియతిలేని

వివిధ భావము లెచ్చట విలయమగునో?
బయట లోప లటంచును బల్కనునికి
భావము లెచట పూర్తిగ భగ్నమగునో?
మార్పులనియెడు నట్టి యా మారుతంబు
నెచట శాంతిఁ జెందుచు నుండు నెపుడుఁగూడ?
నట్టి మానస సంహారి యైనయట్టి
హరుని బూజింతు నేనెప్డు హర్షమొప్ప. 4

(గీతమాలిక)

వేనినుండియుఁ జీఁకటి వెల్లివిరియు?
ధవళ పద్మము వికసింప ధవళకాంతి
యందమును వెల్వరుచుచుండు చందమునను?
వేనినుండి తెల్లనికాంతి వెల్లివిరియు?
నెవఁడు నవ్వీన జ్ఞాన మే యెప్డుఁగూడ
దేజమై యోజమై యెప్డుఁ దెలియఁబడును
ఇంద్రియములను గెలిచియు నెవని హృదయ
మెపుడు నిశ్చలధ్యానము నెంతో గల్గి
యుండి యతఁ డెవనిఁగనుచు నుండునట్టి
మానస సరోవరమునందుఁ గానఁబడుచు
నన్ను గాపాడుచుండెఁ? బ్రసన్నుఁడైన
రాజహంసకు మ్రొక్కి నీరాజనమిడి. 5

(గీతమాలిక)

లోకమందలి చెడుగును ద్రోసిపుచ్చు
నట్టి ప్రభు వెవ్వఁడగునో? మఱెట్టిదైన

కలియుగమునందు హెచ్చుగాఁ గలిగియుండు
నా కళంకమును దుడిచి యంత మొందు
నటులఁ జేయువాఁ డెవ్వఁడో? యాదరమునఁ
దన కరము నెవ్వనికినిడె దక్షపుత్రి? 6

(గీతమాలిక)

తెల్లని కలువపువ్వుల తీరునుండు
జగ్గదనమును కలిగిన సరసు డెవడో?
పరుల మంచికి దనయొక్క ప్రాణములను
విడువ సిద్ధముగానుండు వీరుఁడెవఁడో?
దృష్టి నెవ్వఁడు నిలుపునో? దీనులందుఁ
గాలకూటము మ్రింగిన కారణమున
నీలకంఠముతో నొప్పి నీలకంఠుఁ
డనఁగ నెవ్వఁడు పిలువబడంగఁ జెల్లు?
నట్టి శివునకు మ్రొక్కెదు హర్షమొప్ప. 7

## సృష్టివర్ణన (1)

ఉనికి యునికియు శూన్యము ననెడునవియు
లేవు లోకమాకాశము లేవు మఱియు
నట్టి మబ్బునుగప్పిన దదియునేది?
అదియు వేనినుండియుఁబుట్టెఁ బిదపమఱియు?
గాఢమగు నంధకారపుగర్భమందు
నేదియుండెనో తెలియక యెవరికైన.? 1

(గీతమాలిక)

మృత్యువనునది లేకుండె నిత్యమైన
శాశ్వతత్వము లేదయ్యె సరిగనపుడు
పగలురాత్రియు నేకమై పరగుచుండు
జలన రహితమై కంపము గలదియగుచు
నొంటరిగ దనమహిమతో నొప్పియుండు
దానికావలనేదియుఁగానరాదు. 2

(గీతమాలిక)

జలనిధినిబోలి చీఁకటి యలముకొనియు
నేకమైయుండె భేదము లేకయుండి
గొప్పమహిమను నచ్చీఁకటి గప్పివేయ
శూన్యముననుండి వెలువడెఁ జూడనగియుఁ
దన తపోబలము వలనఁ దప్పనీక. 3

(గీతమాలిక)

మొదట మానసమున నొక ముఖ్యమైన
కోర్కె యను బీజ ముదయించె గొప్పగాను
దాని కిరణములెల్లను దాటి హద్దు
పైకిఁ గ్రిందికిఁ బ్రక్కకు వ్యాప్తిఁ జెందె
దీనిఁ గాంచిరి మౌనులు దివ్యమైన
వారి హృదయములందును వాస్తవముగ
శూన్యముననుండి యునికిని జూడగల్గి. 4

(గీతము)

సృష్టివైభవమప్పుడు స్పష్టమయ్యె
సృష్టిమూలముకిందను సృష్టిశక్తి
బయటను తమశక్తుల నెల్లబయలుపఱచె. 5

(గీతమాలిక)

దీనిమార్గము నెవ్వరు తెలిసికొనిరి?
ఇది యెచటనుండివచ్చెనో యెవరికెరుక?
దేనిలో నిదివ్యక్తమై తేజరిల్లు?
వ్యక్తరూపమున మొదటశక్తివలన
దేవతలు పుట్టియుండిరి తేజమొప్పఁ

గాన నిదియెట బుట్టెనో దేనిమీద
నిదియు నాధారపడియుండెఁ? నెపుడుఁగూడ
దానిగూర్చి యెవఁడెఱుఁగుఁదథ్యముగను? . 6

(గీతము)

సృష్టిగూర్చియు దానిని సృష్టిఁజేయు
సృష్టికర్తకే దెలియును స్పష్టముగను
లేక తెలియకయుండును గాకవాని
కైనఁగాని తెలియకుండు వేనికైన 7

## సృష్టివర్ణన (2)

(గీతమాలిక)

నామరూపములును రంగు నాస్తిగాగ
భూత భావి కాలములు పరిఖ్యాతి లేక

కాలమనునది శూన్యమై గగనసీమ
నావరణ రహితమగుచు హద్దులేక
నాదశూన్యమగుచు నంత నాస్తియగుచు
నేతినేతియని కడు(బ్రఖ్యాతి(గన్న
బ్రహ్మవాదన శూన్యమై పరగుచుండ
సర్వశూన్యముగా నెంతో సాగుచుండు
నొక్కమహనీయ వస్తువై యుండెనొకటి 1

(గీతమాలిక)

కారణత్వ మనెడు నది పాఱుచుండ(
గోర్కె మెఱసెడు నీటితో(గూడ నేను
గలను నేనుంటి నేనుంటి( గడకునంచు
గొప్ప రోదన( జేయుచు( జెప్పరాని
యహముతో(గూడి వెలువడె నందునుండి. 2

(గీతమాలిక)

హద్దులేని కోర్కె యనెడు నంబురాశి
యందు వివిధ శక్తులతో(డ నలరుచుండు
లెక్కలేనట్టి కెరటము లొక్కరీతి
వెలువడెను నలుగడలందు వింతగొల్ప
నవియు నెంతో శక్తినిగల్గి యంతులేక
యెన్ని రూపములందియు నెన్ని వివిధ
చలనములతోడ గన నద్యో సరిగనపుడు?
నెన్ని యున్నవో లెక్కింప నెవరితరము? 3



(గీతమాలిక)

కోర్కె యనునట్టి కడలి[illegible] కొలది
సూర్యచంద్రులు వెలసిరి చ[illegible]
నాకసము నిండె గోళము లంతులేక
కాంతి యావరించె నపు డాకాశమంత
ధ్వనియు నొక్కటి దానిలో బయలుదేరె. 4

(గీతమాలిక)

పెక్కుజీవులు పుట్టెను లెక్కమీఱి
ప్రబలె నిర్జీవ వస్తువు ల్బహుళముగను
జనన మరణము లను నవి కలుగ నయ్యె
భోగబాధలు రోగముల్ పుట్టె భువిని
సూర్యు డాతడు నిజముగఁ జూడమఱియు
నాతని దగును కిరణంబు నదియుగాక
అతఁడు సూర్యుడుకిరణంబునతఁడె యగును. 5

## సమాధివర్ణన

(గీతమాలిక)

సూర్యబింబము లేకుండె సుందరమగు
చంద్రబింబము లేదయ్యె! సరిగఁజూడ
గాంతి యంతయు నశియించెఁగడకు నపుడు
శూన్యమౌ నాకసమునందుఁ జూడనొక్క
ఛాయ రూపము దాల్చిన జగతిబొమ్మ
తేలుచుండు సమాధిలోఁ దిరిగిచూడ. 1

(గీతము)

శూన్యమగు మానసంబునఁ జూడనంత
నిత్యమును లేని జగతియు నిలిచియుండి
తేలిమున్గును బిమ్మటఁ దెలియరాక
నేననెడు ప్రవాహమునందు నిజముగాను. 2

(గీతము)

ఛాయ సముదాయ మప్పుడు శాంతముగను
నాది గర్భమునం జేరి యందునుంటి
నేను నేనుంటి నను నంతు లేనియట్టి
యొకప్రవాహమునం దేలుచుండిపోవు. 3

(గీతమాలిక)

అప్పుడంతయుఁ జూడఁగ నాఁగిపోవు
నేను నేననువాహిని నిలచిపోవు
శూన్యమనునది చేరును శూన్యమందు
వాక్కు మానసంబులు రెండుఁ బలుకలేవు
దానిఁగూర్చియు నే మాత్రమైనఁగాని
యెవని హృదయము దానిని నెరుగగల్గు?
నతడెఁ వర్ణింపగల్గుటకర్హుఁడగును. 4

## ముక్తినొందిన వానిపాట

(గీతమాలిక)

గాయపడినట్టి సర్ప మాగ్రహము చేతఁ
బడగ విప్పుచు లేచును బైకి నెపుడు

నగ్నిపై లేచు మంటయు నధిక మగును
దానిఁ గదలింప నొక్కఁడు పూనినంత
బొమ్మపై దెబ్బఁ గొట్టఁగ రోదనంబుఁ
జేయు సింహముగర్జనచే నెడారి
మారు మ్రోగంగఁ జేయును మనసు చెదర. 1

(గీతము)

మెఱుపు బొమ్మనంటిన యంత మేఘ మెప్పుడుఁ
గుంభవృష్టిఁచి గురిపించుఁ గూడి బలము
నాత్మను గుణించి లోతుగా నరసిచూచి
మహిమవును వెల్లడింతురు మానులెల్ల 2

(గీతమాలిక)

కండ్ల దృష్టిలో క్షీణత కల్గుఁగాక
హృదయమందు నిరుత్సాహ మొదవుగాక
స్నేహధర్మము పూర్తిగాఁ జెడునుగాక
ప్రేమ మోసముఁ జేసియు వీడుఁగాక
కలుగుఁగాక కష్టములును కాలగతిని
కటికచీఁకటి మార్గము గట్టుఁగాక 3

(గీతమాలిక)

ప్రకృతి యంతయు నీపైని ప్రబలమైన
కోపమునుబూని యణపంగఁ గోరుఁగాక
తెలిసికొను మాత్మ యిట్టులు దేఁటపడఁగ
గలదు దైవాంశ నీయందు ఘనత నొప్పి

సాగుమింకను ముందుకు వేగముగను
దప్పుతో ద్రోవలఁ ద్రొక్కక తత్క్షణమున
గమ్యమును జేర యత్నింపు కడకునీవు. 4

(గీతమాలిక)

దేవతనుగాను మానవ దేహిఁగాను
పశువుఁగాను దేహముఁగాను వాస్తవముగ
మానసముఁగాను పురుషుఁడుఁగాను నేను
స్త్రీనిగూఁడఁగాను మఱియు దేని గాను
గ్రంథములు నన్ను వర్ణింపఁ గలుగ లేక
చూచు నిర్ఘాంతపడి యొక్కచోట నిలచి
నే నతండనగుదుఁజుమ్మి నిశ్చయముగ. 5

(గీతము)

సూర్యచంద్రులు భూమియుఁ జూడఁ బెక్కు
తారలును ధూమకేతువు ల్చేరుముందె
కాలమనునది లేకుండు కాలమందె
యుంటి నేనుందు నిపుడు నేనుందు ముందు. 6

(గీతమాలిక)

సుందరంబగు నవనియు సొంపుమీఱు
సూర్యుఁడును, జల్లదనమును సొబగునొప్పి
యుండు చంద్రుఁడు నక్షత్ర యుతముగాఁగ
మినుకు మినుకు మనుచు వెల్గు మిన్నుగూడ
సృష్టిసూత్రములనుబట్టి సృష్టియందు

సంచరింపుచు నివసించి సరిగ నవియు
బంధములయందు నశియించు బంధములను. 7

(గీతమాలిక)

మానసంబను కప్పను మఱియుఁ గల్గి
స్వప్నతుల్యమౌ వలలోన సరిగఁ జిక్కి
పడుగు పేకలతోఁ గూడి పరగుచుండు
నూహలందు మాత్రమెపుడు నుంచఁబడెడు
స్వర్గ మర్త్యపాతాళాల సామ్యమొప్పు
పెక్కులోకము లచ్చట లెక్కమీఱి
వెలయుచుండును నరునకుఁ దలపునందు. 8

(గీతము)

బాహ్యరూపము లివియని గ్రాహ్యమగును
కాలమవకాశములు మఱి కారణమును
ఫలితమును బుద్ధి యూహల బయటనుండి
సాక్షివలెనుంటి జగతికి సరిగ నేను. 9

(గీతమాలిక)

ఉన్నదొక్కటి మాత్రమే యెన్న రెండు
లేక పెక్కుగా నేవియు లేవుసుమ్మి
యొకటులన్నియు నాయందు నొకటియయ్యె
నేను దేనిని ద్వేషింప నిజముగాను
నన్ను విడఁదీయఁజాలను నన్నునుండి
ప్రేమ గలిగియుండుట నాకుఁ బ్రీతికరము. 10

(గీతమాలిక)

కలలనుండియు మేల్కొను గల్గుమేలు
బంధములనుండి ముక్తిని బడయుమీవు
భయముఁజెందకు మాయను బారఁద్రోలు
నన్ను నాఛాయ భయపెట్ట దెన్నఁడైనఁ
దుదకు నేనె యాతండని తోఁచునీకు.

## నాయాట ముగిసినది

(గీతమాలిక)

జీవితంబను వాహినిఁజేరి నేను
పాటుపోటుల రీతిని బయలు వెడలి
కాల కెరటములనుగూడి కలసిమెలసి
యడఁగి లేచుచు నస్థిరంబైన పెక్కు
జన్మలందలి దృశ్యము ల్చాలఁగనుచుఁ
దొర్లి పోవుచుంటిని నేను త్రోవ లేక
అంతు లేని యీనాటకమందు నాకు
విసుగు జనియించె నిప్పుడు వివిధమైన
యిట్టి దృశ్యములను గాంచి తుట్టతుదకు
దనివి నొందగ నేనైతిఁ దథ్యముగను
నిట్లు పరుగిడుటయెగాని యెప్పుడైన
గమ్యమును జేరునాశయుఁ గలుగదయ్యె
దృష్టికినిగూడ దూరమై తీరముంట
జన్మజన్మల యందును సరిగ నేను
ద్వారములకడఁ బడియుండ దారికొఱకు

నవియుఁ జెరువకుండెను దానినపుడునాకుఁ
జాలకాలము నుండియు సత్యమనెడు
దానికిరణము నొకదానిఁ గాననెంచి
నేను జేసిన కృషియంత నిష్ఫలంబు
గాఁగ నల్ప జీవితపుఁ బైగట్టునందు
నిలిచి క్రిందకుఁజూడగ నేనుగాంచ
గల్గితి నటుల మనుజుల కలవరంబు
గుంజులాడుచు నేడ్చుచుఁ గూడివారు
నవ్వుచుందురు మరియును నాల్గుదిశల
నెందుకట్టులొనర్తురో యెవనికెరుక?
మొగముఁ జిట్లించుకొనుచును ముందునిలిచి
యంధకారము దారితేకంచుఁ బల్కు
గమ్యమును జేర హద్దిది కడకునెపుడు
భావికాలగతీ! నాకుభ్రాంతిగూర్ప
కుండెడి నీవాజములఁ గూడియుండి యెపుడు
వారితోడఁ గ్రీడింపుము వదలినన్ను
జ్ఞానమార్జనఁ జేయగఁ బూనువాఁడు
పొందవలయును దుఃఖము మొదటనెపుడు
గాన వారితోఁ గాలంబుఁ గడుపుమీవు
నేనుమాత్రము విశ్రాంతిఁ బూనఁజాలఁ
దేలుచుండెడు బుడగను బోలుపుడమి
బూలకములగుచుండియు మోసపుచ్చు
దానిరూపము నామము దానిజనన
మరణములు నాకుమాత్రము తరచిచూడ

వ్యర్థములనుచుఁదోఁచు యథార్థముగను
దాటి నామరూపములను దారిఁబోవ
గోరుచుంటి నో యమ్మరో! దారిఁదెలుపు
మిపుడు నలసటఁజెందితి నీవు నాకు
కాంతి ద్వారకవాటములను గడకఁదెలుపు
మిల్లుఁజేరఁగ వాంఛజనించెనాకు
నేను నీపుత్త్రుఁడనుగానె? నిజముగాను
"పుడమిమీఁదను నాఁటూట ముగిసెనమ్మ"
నీవు నన్నంపితివటకు నిశ్చయముగ
జీకటిని నేనునటనంబుఁ జేయుటకును
నీవుభీకరాకృతిఁ దాల్చినావు తల్లి!
కాంచ నీమోము భీతియుఁగలైనాకు
నాశయదుగంటె భయమునాకధికమయ్యె
విసుగుఁజెందితి నాటలోవినుము తల్లి!
దుఃఖసుఖములతోఁగూడి తుచ్ఛమైన
సారరహితమౌ సంసారసాగరమున
జననమరణములనుగూర్చు జన్మలెన్నొ
యెత్తుచుంటిని విధిలేక యిచటనేను
పలుక జీవనము మృతజీవనముగాదె!
మృత్యువనునది సుఖదుఃఖ మిళితమైన
నదియు నొకజన్మ కారంభమగునుగాదె?
దుఃఖసుఖముల యాకులతోడఁగూడి
పాత చక్రిమె తిరుగుచు బయలు వెడలు
దాముముందు బూదె యగుటఁదలఁప లేక

జ్ఞానశూన్యులౌ బాలురు చక్కనైన
యాశలను జీవితాకాశమందు ముందుఁ
గల్గఁబోయెడు వానిని గలలఁగాంచి
తాముగతజన్మ లందును దనివితీర
ననుభవింపని వానిని ననుభవించు
నాశతోడను జీవితమంతగూడ
ద్రుప్ప పట్టినవిధమునఁ దోముచుంద్రు
ఇంతలో జీవితముగూడ నంతమగును.
జ్ఞానమార్జించు తరుణము సాగిపోవు.
జీవితంబను చక్రము చివరకెట్లు
దిరుగుచుండును వృథగాను దెఱిపి లేక
క్రొత్తజీవులును జన్మించి కూడిబలము
సాగుచుండును చక్ర మే సమయమందు
మాయనాటక మిదిగాక మఱియు నేమి?
దీనిఁగదలించు శక్తియే లేనియాశ
కోర్కెయనునది దిమ్మగాఁ గుదిరియుండు
దుఃఖమానందములు దానితోడఁ దిరుగు
నాకునైయుండు దానికి నట్టిచక్ర
మందు గ్రిందమీఁదను బడుచుందునేను
కాని యెందుఁబోవుచునుంటిఁ గడకునిపుడు
దెలియదమ్మరో! నాకు నాస్థితినిగాంచి
యగ్నినుండియుఁ గాపాడు మమ్మ! నన్ను

గోరికలతోడఁ దేలుచుఁ గుర్రింకుచుంటి
దయకు నిలయమై యుండెడు తల్లి! నీవు
వానినుండియు రక్షించి భయముఁదీర్చు
కోపదృష్టినినాపైని జూపకిమ్మ
దానినిభరింపఁ జాలనుతల్లి! నేను
తప్పులనుకూడ మన్నించి దయనుజూపి
కష్టములనుండి దరిఁజేర్చు కడకునన్ను
దుఃఖములు కంటిధారలు దూరముండు
ధరణి నానంద సుఖములఁ దాటియుండు
సూర్యచంద్రులు తారలు చూపకుండు
మెఱుపుఁగాంతియు దేనిని మెఱయునటుల
జేయి లేకుండు నెప్పుడుఁ జివరకవియు
ప్రతిఫలింపగఁ జేయును వాస్తవముగ
దానికాంతినిమాత్రమే దానికడకు
నన్నుఁ జేర్చియునమ్మరో! నన్నుఁగావు
భ్రాంతికలిగించు కలలను బాఱఁద్రోలి
కప్పి నీమోహము నాకును గానఁబడక
యుండునటులఁ జేయు తెఱగు నింపుదయను
నాకుఁజూపియుఁ దొలగించి నన్నుఁబ్రోవు
మమ్మ! బంధములనుద్రెంచి యమ్మ! నీవు
స్వేచ్ఛనిడుమమ్మ నాకును స్థిరముగాను
అమ్మ! నాయాట ముగిసెనే యని సుఖింతు

# తప్పుగా గ్రహించుట

(గీతము)

గంగయొడ్డున వెనుకటి కాలమందు
వృద్ధుఁడగు మతబోధక సిద్ధుఁడొకడు
రాముఁడును సీతయు నవతారంబు లనుచు
సీత బాధల వివరించి చెప్పసాగె. 1

(గీతము)

నంతలో వానిబోధయు నంతమయ్యె
శ్రోతలిండ్లకుఁ బోవుచుఁ జోద్యముగను
వాదనలు సల్పుచుండియు వానినొక్క
ప్రశ్నయడిగెను వారిలోఁ బ్రముఖుఁడొకఁడు. 2

(గీతమాలిక)

తెల్పుమయ్య మాకిప్పుడు దేఁటపడఁగ
వేనినిగుఱించి మీరిప్డు విశదముగను
బోధఁజేసిరో? యట్టి యాపురుషుఁడైన
రాముఁడెవ్వఁడు? సీతయు నేమి యగును?
వారిఁగూర్చియుఁ దెల్పుఁడు వాస్తవముగ 3

(గీతము)

నేను జెప్పినదానికి నిశ్చయమగు
భావము గ్రహింపకుండియుఁ బల్కి యిటులఁ
దప్పుటర్థంబుఁ దీయుట తగునెమీకు?
నేనిటులఁ బల్క నన్ను మన్నింతుర్గాక. 4

(గీతమాలిక)

అంతయునుగూడ దైవమే యనుచు నర్థ
శూన్యమగుమాట బోధింప సులభమగును
పిచ్చి భావమె యగునద్ది వినుఁడుదాని
నేనిపుడు మీకు బోధింపఁబూన లేదు
తప్పుగా గ్రహించితిరయ్యా ! దానిమీరు. 5

(గీతమాలిక)

నేను జెప్పెడుదానిని నిజముగాను
జ్ఞప్తియుంచుండు డిపుడైన జ్ఞానమబ్బి
దైవమే సత్యమగుఁగాని తలప నితర
మంతయు నసత్యమేయగు నయ్యయెపుడు
జగతి నిజమనితోఁచును జనులకెల్ల
స్వప్నతుల్యముగాదె యీజగతిఁ దలప
అతఁడె సత్యమే నేనన నతఁడె సుమ్మి
వస్తుతత్వము మారదు వాస్తవముగ 6

## ఆశీర్వాదము

(గీతమాలిక)

తల్లి! ప్రేమతో నొప్పు హృదయముగల్గి
వీరుని దృఢ నిశ్చయముతో వెలయుచుండి
మలయమారుతమువలె సౌమ్యతయుగల్గి
యార్యపీఠములందు నత్యధికముగను
బ్రజ్వలించుచు స్వేచ్ఛను బడసెనీవు
పావనమనోహరత్వము బలము మఱియుఁ

బెక్కు యోగ్యతలు గలిగినెక్కుముగను
భారతావనిలోఁ బుట్టి ప్రతిభఁగాంచు
నట్టిపురుషుని నీవు చేపట్టినాని
కడుపు గృహిణివై చెలిమియుఁగలిగియెంతో
సేవనొనరించి కీర్తిని జెందుకొనావు
పూర్వ మే జీవి యిట్టి యపూర్వమైన
జీవితముఁగూర్చి కలనైనఁజింతఁజేసి
యుండియుండదు నిజముగానొక్కఁడైన.

## నేను నిన్నుగూర్చి పాడెడుపాట.

(గీతమాలిక)

పాటనొకదాని నినుఁగూర్చి పాడుచుంటి
జనులభూషణ దూషణల్ సరకుగొనక
ప్రకృతితోఁ గూడియుండెడు పరమపురుష!
నీకు సేవకుఁడ నగుదు నిజముగాను
నేను సేవకుండను జుమ్మి నిశ్చయముగ
శక్తితోఁగూడి నీవుండ శక్తిఁగొలువు
నట్టినీపాదములకు నే నమితభక్తి
తోడ వంగి నమస్కృతితుదకొనర్తు 1

(గీతమాలిక)

నీవునా వెన్కఁదిరముగా నిలిచియుండి
నేను వెన్కకుఁదిరిగియు నిన్నుజూడ
నిండుమందహాసముతోడ నందుమోము
గాంచుచుందును గన్నులకరవుదీర
గాన పాడుచుందును నేను కడకునెన్నొ

మార్గునినుఁగూర్చి పాటను మఱలమఱల
గాన భయముఁ జెందను లేశమైనగాని
జననమరణము లనునట్టి సహజమైన
ప్రకృతిజన్యగుణాంబులు వాస్తవముగ
నాపదములకు మ్రొక్కుచునంటునవియు
నెపుడు సాష్టాంగపడుచుండు నెఱిగినన్ను 2

(గీతమాలిక)

జన్మజన్మలయందు నిజంబుగాను
నీకు సేవకునిగ నుంటి నేను భువిని
దయయనెడుసాగరము నీవెథన్యచరిత!
ఎవరునీచర్యలనుగూర్చి యెఱుగగలరు?
ముందునాగతి యెటులుండు పుడమియందు
నెఱుగకుంటిని దానిని నెఱుగఁగోర
భక్తి,ముక్తి, జపంబు, తపస్సు,పూజ,
ధ్యానభోగము లన్నిటి ధరణినేను
వదలియుంటిని నీయాజ్ఞఁబట్టి యిపుడుఁ
గాని నాకొక కోరిక కలదుసుమ్మి
యదియె నీతోడి యన్యోన్యమైన మైత్రి
కోర్కె నాకడ్డురాకుండఁ గొంచెమైన
నన్ను నీయందుఁజేర్చి కొనంగనేను
నిన్ను వేడుచుంటిని ప్రభూ! నన్నుగావు. 3

(గీతమాలిక)

కన్ను జగతిని గాంచునుగాని తాను
తన్నుగాంచ లేకుండును దానిదాను

గాంచు నితరులయందును గడకు నెపుడు
నీవు నాకండ్లు నీవుండి నిజముగాను
జీవముగల దేహము ప్రకాశింపఁజేయు
నెపుడు నీ మోము తేజము నినుమడింప
గావఁ గన్నులన్నియు నీ పై గాంచ నెవ్వడు. 4

(గీతమాలిక)

బాలుఁడాడెడు నాటల పగిదినుండు
నీ యెడల నేను వర్తించు నీతి క్రమము
నేను కొన్ని వేళలయందు నిన్ను గాంచి
కోపమును బూని యుందును గూడ నేను
కాని కొన్ని వేళలయందు నేను నీకు
దూరముననుండి మిక్కిలి ఘోరమైన
కటికిచీఁకటి రాత్రిని నెటకో యేగి
స్వేచ్ఛతో సంచరింతును చింత లేక
కాని యచ్చట మానముగల్గి నీవు
కండ్లనుండియు నీ రెంతో కారుచుండ
నిలిచియుందువు నాముందు నిజముగాను
అపుడు నీ సుందర వదన మధికమైన
ప్రేమదృష్టిని నాదగు మోముపైనఁ
బడఁగఁజేయ నేను వెనుకవైపు దిరిగి
తత్క్షణము నిన్ను గాంచి మోదంబుమీఱ
మోకరించియు నీ పాదములను బడుచుఁ
గోపదృష్టిని నీవు నీకొమరుపైనఁ

జూపకుందువు గాన నాచొప్పుఁదెలిసి
నన్ను మన్నింప వేడను నిన్నునేను
బుద్ధిమాలినవాఁడనై పూర్తిగాను
సరిగనేఁజేయు విపరీత చర్యలకును
నెవరుభరియింపఁ గలరయ్య యీవుగాక?. 5

(గీతమాలిక)

**నీ**వెగురుఁడవు నాకెప్డు నిర్మలాత్మ
నీవు నాయాత్మ సఖుఁడవు నిజముగాను
నే**ను**గాంచితిఁ బలు**మా**రు నిన్ను నేను
**నీ**వు, **నీ**వునునిజముగా నేనెసుమ్మి
నే**నుమా**టాడు భాషలో నీవుగలవు
నీవునాకంఠమందున నిలిచియుండ
జ్ఞానకమనీయమూర్తియౌ శారదవలె
నొప్పియుందువు ప్రభువర్య! యెప్పటికిని
నరులు **నీ**యాజ్ఞవేననే సరిగనెపుడు
బడియుశక్తియౌ **మా**యాప్రవాహమందు
గొట్టుకొనిపోబడుచునుఁదుర తుట్టతుదకు
గలతజెందిన సంద్రపు టలలయొక్క
ధ్వనియు నురుముబోలిన **యు**తిప్రబలమైన
నీకుగల కంఠనాదము నేకరీతి
బైకి వినిపించునట్టులఁ బడుచు వెన్క
దాని గొనిపోవుచుఁడును తథ్యముగను
సూర్యచంద్రులనుండియు సూటిగా**ను**
వినగఁజెల్లును నీ కంఠమున వెలువడు

ధ్వనియునున్ గూడ నెప్పుడు స్పష్టముగను
మలయవాయువునందు నీపలుకు తేటి
సరిగ వినుపించుచుండును జనులకెల్ల
గాన బాహ్య బోధలెపుడు జ్ఞానమిచ్చి
సత్యసందేశమును నీయజాలకుండు
గాని యాకాశ పథమున గానబడెడు
సూర్యచంద్రులు, గ్రహములు చూడ నెద్ద
కాంతినినొసఁగు తారలు గగనసీమ
ధూమకేతువు మెఱుములతోడఁగూడు
సృష్టిప్రాముఖ్యములగు విచిత్రవస్తు
చయము జిజ్ఞాసువునకు విజ్ఞానమిచ్చి
భక్తిసాధకములగుచుఁ బరగునెపుడు
శ్రద్ధగలమానవులు దీని సరిగగాంతు. 6

(గీతమాలిక)

క్రోధకామ మాశలతోడఁ గూడియుండు
మోహము మొదలుగాగల ముఖ్యమైన
గుణములే సృష్టికెల్ల గారణములయ్యె
విద్యయు నవిద్యయునుగూడ వెలయుచుండు
నట్టియునికియుండు, మఱియునహముతాని
కెపుడు కేంద్రమై ద్వంద్వభూయిష్ఠమైన
కష్టసుఖములతో నిండి కడకు జనన
మరణములు వినాశమ్మును మఱియునట్టి
జీవితము గల్గియుండును జివరవఱకు

బాహ్యాభ్యాంతర్యమును దాని బాహువులగు
నాకసమునందు వెల్గుచున్నట్టి సూర్య
చంద్రులు మఱి నక్షత్రముల్ సాగరమున
నుండువస్తువులును, మధ్యనుండుసకల
వస్తుజాలము, మనసునుబలుక మఱియు
బుద్ధి, చిత్త మహంకారములును దేవ
యక్ష కిన్నర సిద్ధ సాధ్యాళి దైత్య
పక్షి సంతతులును మఱిబహుళమైన
క్రిములుఁ గీటకములును మఱియును బెక్కు-
వణువులును మిశ్రమములగు నన్ని జీవ
కోట్లు, నిర్జీవకోట్లును గూడ బాహ్య
మయ్యు నాంతర్యమగ నుండు నన్నిగూడ
నొక్క సామాన్యమగునట్టి యునికియందు
గనుబొమలపైనఁ బెరుగుచుఁ గానఁబడెను
వెండ్రుకలగీతి బయటను వెలయుచుండి
బాహ్యసృష్టియు నిట్టుల బయటఁబడియె. 7

(గీతమాలిక)

మేరుపర్వత శిఖరము మిన్ను ముట్టు
మేఘములఁ జొచ్చి పోవఁగ మితినిమీఱి
మంచుతోఁగూడి యెన్నియో మైళ్ళకొలఁది
దానిపంక్తులు దిశలను దాటిపోవు
తెల్లనగుమంచుతోఁగూడి తేజమొప్పి
రవియు భూమధ్యరేఖపై రహినిమించి

తెల్లని కిరణకాంతితోఁ దీవ్రమైన
దృష్టితోడను మేరువు దిశకుఁ బనుప
మంచుగొండయుఁ గాంతితో మించి వెలుఁగు
దాని దృశ్యము వర్ణింపఁదరముగాదు
కిరణజాలమునకుఁ గొండ కేంద్రమయ్యెఁ
బిడుగులనుబోలి వేడిమి ఘెళ్ళుమనుచు
శిఖరమును ముంచివై చెను శిరముపగుల
గాంతితోఁగూడి వేడిమిఁ గడకు రవియు
నన్ని శిఖరములను బడునటులఁజేయు
నతఁడు కదునలసియు మూర్ఛ నందినటులఁ
దోచుచుండును వానిని జూచినపుడు
గాఢమగు మంచు వేడిచేఁ గరగినపుడు
శిఖరముల నుండి యుదకము శీఘ్రగతిని
భయముగొల్పెడు ధ్వనితోడఁ బడుచుఁగ్రింద
బారు సెలయేటి రీతిని బయలునందు
దృశ్యమంతయుఁ గలయని తేలుఁదుదకు. 8

(గీతమాలిక)

నిరుపమానకటాక్షము నీకుఁగల్గ
మానసంబున నాకుండు మార్పులెల్లఁ
నేకమైపోయి యొకటిగా నెఱుఁగబడియె
జ్ఞానభానుండు నాయందుఁ గానఁబడఁగ
వేయి సూర్యులకాంతియు వెన్నుఁజూపె
సూర్యచంద్రులుఁ దారలుఁ జూడ లేవు

స్వర్గపాతాళ లోకము ల్భ్రమసిపోవు
గోవుడెక్కచే నేర్పడు గుంటరీతి
జగతి గాన్పించుచుండెను సత్యముగను
నమితబాహ్యాచిత్రిక దాటునంత నరుఁడు
చేరునొక తావు యోచించి చివరకెట్లు
బాహ్యాలోకము క్షీణించు బాధలెల్ల
నంతమొందును దేహము నంతమొంద
మనసునందలి గర్వము మాయమగును
హృదయ శృంఖలములు గూడ కదలిపోవు
బంధములు వీడిపోవును భ్రాంతితొలఁగుఁ
గంపనములేని నాదంబు కడకునొకటి
శ్రావ్యతరముగ వినిపించుఁ జక్కగాను
నీది యాధ్వనియగుఁజుమ్ము నిశ్చయముగ
దానిని వినుచునుండి నీదాసుఁడెపుడు
సిద్ధముగనుండు నీపనిఁజేయుటకును. 9

(గీతమాలిక)

ప్రళయకాలమునందుఁ జిత్రముగనొప్పు
జగతి లయమును జెంద నాసమయమందు
నేనుమాత్రముందును గడు నిశ్చయముగ
జ్ఞాతయనువాఁడు మఱియును జ్ఞేయవస్తు
వులును నాజ్ఞానమునుగూడఁ బూర్తిగాను
లయముఁ జెందును లోకము లయముఁగాంచు
జగతి నూహింప గుర్తింపఁ దగదు నాడు

సూర్య చంద్రులు తారలు శూన్యమగును.
అట్టిదియె మహానిర్వాణ మనంగంబరగు
క ర్త కర్మ క్రియలు వాని కారణంబు
లంత్యమై గాఢ తిమిరంబు నలముకొనగ
నట్టివేళను నేనుండు నచటంగాంచ, 10

(గీతమాలిక)

భేదములు లేక గుణములు వెలయుచుండి
శాంతిఁజెందియు నుండును సాంతముగను
వస్తువొక్కటి గలదు ప్రశ స్తమగుచు
నదియు నణురూపమై యుండి యమితముగను
సూక్ష్మరూపము నొందియుఁ జూడఁబడుచు
మిశ్రితముగాక యేకమై మెలగుచుండ
సకల మందు లయముఁజెందు సరిగ నపుడు
నచట నేనుందుఁ దప్పక యరసిచూడఁ. 11

(గీతమాలిక)

దిరిగి వికసింతు నేనప్డు తేజమొప్పి
నేను నేనను నహమప్డు నిలుచు మొదటఁ
బిదప నాశక్తిలోనుండి బిగ్గరగను
నాదమొక్కటి వినిపించు నాల్గుదిశల
"నదియె" ఓమ్ అను పదముగా నలరుచుండు
శూన్యమున నుండి శబ్దము శ్రుతివిమించు
హద్దులేని యాకాశమునందు నదియుఁ

గంపనముతోడ మ్రోగును గడకు నపుడు
నాదికారణభూతము లట్టి తత్త్వని
నిదురనుండియు మేల్కాంచు నింగిముట్టు
లెక్కలేని యణువులవు డొక్కరీతిఁ
నంత వెలువడు నూతనంబైన యట్టి
జీవరాశిని సృష్టింపఁ జివర కవియుఁ
గ్రొత్త జీవులతోఁగూడి క్రొత్తసృష్టి
జరుగఁ బ్రారంభమగుటచే సరిగనపుడు
నణువు లెగులుచు గిఱ్ఱున నన్నిదిశలఁ
దిరుగుచును నృత్యమునలువు తీరుగాను
చాల దూరమునుండియు శక్తితోడఁ
జేరుచుండును కేంద్రము చివరకలియు
గొప్పభూతసాగరమందుఁ గొండలవలె
పైకిలేచును గెరటముల్ ప్రాణవాయు
వపుడు నాసాగరముపైన వడిగవీవ
పడుచు లేచుచుఁ బొంగుచుఁ బ్రబలమగుచు
గెరటములపిండు కదలుచుఁ గ్రియకుమెఱుము
బోలిముందుకు సాగుచుఁ బోవుచుండు
శక్తిచే ద్రోయబడునట్టి శకలములుగ
బెక్కుగోళములు కదలు నొక్కసారి
గ్రహము నక్షత్రములుఁ బెక్కు గగనమందు
నమిత వేగమున గదలి యాడుచుండు
మనుజుని నిలయమగు భూమి మఱలమఱల

దిరుగుచుండియుఁ దనచుట్టుదిరుగు రవిని
జుట్టికూడ విశ్రాంతి లేనట్టిరీతి. 12

(గీతమాలిక)

ఆదియందు సర్వజ్ఞుడనైన నేను
నిండియుంటిని నాయందు నుండెమాయ
చలన మచలనములు రెండు గలిగి యదియు
సృష్టిచేయుచు నుండును జివరకెపుడు
నాడుచుండును మాయతోఁ గూడినేను
మఱియు నాయాజ్ఞవలననే మహినిమేఘ
చయము రాచుకొనుచు బోవు రయమువిూఱ
నవియుగర్జన చేయును నాకసమున
నుఱుము మెఱుములతోఁ గూడి యుండి యమిత
వేగముగ తుపానులు చెలరేగుచుండు
మందమారుతము దిశలయందు వీచు
జల్లని కిరణములనంపుఁ జందురుండు
నెండియుండిన భూమియునుండుఁదిరిగి
యాకుపచ్చని రంగుతో నందముగను
పచ్చిక బయళ్ళతోనిండి పాకుచుండు
లతలతోడను జెట్లతో రహినిమించి
సుందరమగు కాంతులవెల శోభగూర్పఁ
బూర్ణముగ వికసించియుఁ బొల్పుగాను
మంచుచేఁ గడుగఁబడియు మించిసుఖము
సూర్యుని దిశకుఁ దలయెత్తి చూచుచుండు. 13

# స్నేహితున కిచ్చిన సందేశము

(గీతమాలిక)

ఎచటఁ జీఁకటి కాంతిగా నెంచఁబడును?
దుఃఖము సుఖముగా నెందుఁ దోఁచుచుండు?
వ్యాధి యారోగ్యముగ నెటఁ బరిణమించు?
నెచట బిడ్డ పుట్టిన యంత నేడ్వనదియుఁ
బ్రతికి యుండిన నట బెంచబడునో? యట్టి
మాయచేఁ గలుగు ప్రపంచమయము నీవు
గాంచఁ గలుగుదు వె? సుఖంబు నెంచిచూడ, 1

(గీతమాలిక)

పోరు యుద్ధంబు లెచ్చటఁ బొసగుచుండుఁ?
గోడకుపైఁ దండ్రి యెచ్చటఁ గ్రోధమూను?
నహామహాంబనుపాటయె యంతు లేక
పాడఁబడుచుండు నెచ్చటఁ బ్రజలచేత?
నట్టి మాయా ప్రపంచమం దరయ నీవు
కాంచఁగలుగుదు వే? శాంతి నించుకైన. 2

(గీతము)

స్వర్గ నరక మిళితము సంసార మరయ
నిట్టి మాయసంసారము నెవరుదాటఁ
గల్గుదురు? కర్మబంధముల్ కట్టివేయ
బానిసీడేడ? రక్షణఁ బడయగల్గు. 3

(గీతమాలిక)

యోగమార్గమ్ము నింద్రియ భోగమ్ములును
గృహనివాసియు సన్న్యాసి క్రియలఁ దెల్పు
జీవితంబులను ధనమార్జించువిధము
పూజ నియమము ధ్యానము పూర్ణమైన
యింద్రియ జయంబు మతకర్మ లెన్నియేని
త్యాగమునుగూడఁ గల్గియుఁ దనివితీఱ
ననుసరించియుఁ వాని నే ననుభవమున
నేమి తెలిసికొంటిని తుద కిపుడునేను? 4

(గీతము)

లేశమైనను సౌఖ్యంబు లేనికతన
జీవితము కష్టములకు వశీకృతంబు
మంచి హృదయముగల్గ నీకెంచిచూడ
గష్టములు దానికిని మించి గల్గుచుండు. 5

(గీతమాలిక)

కల్గియు విశాలహృదయముఁ గలిగి ప్రేమ
త్యాగమూ ర్తివిగానుండు తరుణమందు
నీకు నేతావు లేకుండు లోకమందు
గట్టిదెబ్బను భరియింపఁ గల్గు నినుము
దానిని భరింప రాతికిఁ దరముగాదు 6

(గీతమాలిక)

ఆత్మగౌరవ మిసుమంత యైన లేక
చురుకుఁదనమును నీయందుశూన్యమగుచుఁ

దేనెలొల్కు పల్కులయందుఁ దీప్పుగల్గి
విషమునిండిన హృదయము నెలయుచుండి
సత్యమునకు దూరమగుచు సబబువీడి
యహరహముఁగొల్చుచుండఁగ నపుడు నీకు
స్థానముండును జుమ్మి సంసారమందు. 7

(గీతము)

జ్ఞానసంపాదనకు నేను సగముకాల
మీభువిని గడపితిని యథేచ్ఛగాను
ప్రేమనాయందు నెలకొల్ప పిచ్చివాని
విధముగానేను ఛాయల వెంటఁబడితి. 8

(గీతమాలిక)

సకలమతములు వెదకితి సత్యమరయఁ
బర్వతగుహాలయందును వనములందు
రుద్రభూములయందును భద్రముగను
గంగ మొదలగు పుణ్యమొసంగు పెక్కు
నదులతీరములను గొన్నినాళ్లు నేను
గడిపియుంటిని నేను భిక్షాటనంబు
నెంతకాలము గడపితి నింతవఱకు? 9

(గీతమాలిక)

మిత్త్రుఁడును లేక డబ్బైన మివులకుండఁ
జిరుగుగుడ్డల ధరియించి తిరుగుచుండి

యేగి యింటింటికిని తుదకేది దొరకు?
నట్టిదానిని భుజియించి యధికమైన
తపముచే మేనుడయ్యించు తరుణమందు
నెట్టిదద్రవ్యము నార్జించితిపుడునేను?. 10

(గీతమాలిక)

వినుము. మిత్రుడ! నీకిప్డు విశదపఱుతు
హృదయమందలి భాగము ల్మొదటనుండి
నేను నాజీవితంబున నిజముగాను
గొప్పదగునిట్టి సత్యమునొప్పుగాను
గాంచఁగలిగి యనుభవము గలిగినంత
జీవితంబను సుడిలోనఁజేరియలల
తాకిడివలన దెబ్బలు తగులుచుండ
నట్టి సంసారసాగర మనెడుదాని
దాట నొకమాట కలదను మాట నిజము
అట్టిసొకయె దాటించు నంబురాశి. 11

(గీతమాలిక)

పూజఁజేసెడి విధులెన్నొ పుడమిఁగలవు
యోగమార్గములు వివిధ యాగములును
శాస్త్రములును వేదాంత విచారణలును
ద్రవ్యసంపాదన విధులు దానిపిదప
ఖర్చుపెట్టెడు రీతులుఁ గలవు పెక్కు
కాని యివ్వి యన్నియుఁగూడ మానసంబు

నందు గలుగు భ్రాంతులుమాత్రమగును జుమ్మి
ప్రేమయనునది యొక్కటే పెన్నిధియగు. 12

(గీతమాలిక)

బ్రహ్మ, జీవుఁడు, నరుఁడు, దైవంబు, దేవ
తలును, దయ్యముల్, పితృదేవతలును, ధరణి
యందు నుండునట్టి మృగ విహంగములును,
మఱియుఁ గ్రిమికీటకంబులై మనుచునుండు
నన్ని జీవుల హృదయము లందుఁగూడ
నిట్టిప్రేమయే వెలుగొందు నెంచిచూడ. 13

(గీతమాలిక)

దేవులందఱిలో మహాదేవుఁ డెవఁడు?
జగతి నంతను గదలింపఁ జాలునెవఁడు?
బిడ్డ కొఱకును బ్రాణముల్ వీడుతల్లి,
దొంగతనమును జేయును దొంగకూడ
వీని కంతకు మూలము ప్రేమసుమ్మి. 14

(గీతమాలిక)

అదియు వాఙ్మన సంబుల కావలుండు
దుఃఖసుఖములతో నుండుఁ దుదకు నదియు
సర్వశక్తియు సర్వనాశనముఁ జేయు
కాళికాదేవివలెనుండుఁ గడకునదియె
దయకు నిలయమై యొప్పును దల్లివలెను. 15

(గీతమాలిక)

వ్యాధి యా ప్తబంధు వియోగబాధ తీవ్ర
తరముగానుండు లేమియు, ధర్మబుద్ధి,
ధర్మశూన్యము, దుష్టమౌ కర్మ, మంచి
కర్మల ఫలితములుగూడఁ గడకుఁ బేమ
యనెడు దానిఫలితములై తనరుచుండుఁ
గాని జీవుఁడొక్కఁడు చేయఁగలుగు దేని?. 16

(గీతమాలిక)

సుఖముఁబొందఁగ నాతురతఁ జూపువాఁడు
దుఃఖముకొలకు మిక్కిలి దొర్లువాఁడు
మృత్యువును గోరువాఁడును నిత్యమైన
జీవితముఁగోరువాఁడును జెప్పనెపుడు
భ్రాంతితోఁగూడి మతిలేనిపశువులనియుఁ
బిచ్చివారలనియుఁ బల్కవచ్చుఁగాదె. 17

(గీతము)

స్వచ్ఛమగునట్టి మనసనుస్యందనంబు
నెక్కినీ వెంతదవ్వైన నేగియున్న
దుఃఖసుఖములు సుడులుగా దొర్లుచుండ
నదియు సంసారసాగరమగును దుదకు. 18

(గీతమాలిక)

వినుము రెక్కలు లేనట్టి విహగమీవు
తప్పుకొను మార్గమిదికాదు తఱచిచూడఁ

గష్టములు పెక్కు తఱచుగఁ గల్గు నీకుఁ
దుదకు మృత్యువు దప్పదు పదునుమించు
సాధ్యపడనట్టి కృషి నీవు సలుపుటేల?. 19

(గీతమాలిక)

జ్ఞానమార్గము వ్యర్థముగాన నీకు
దానిమీఁద నీ వెప్పు డాధారపడకు
మర్చనలు ప్రార్థనలు వీడుమయ్య యింక
బలము నార్జింపఁ గృషిఁ జేయ వలదు నీవు
అహము లేని ప్రేమయె నీకు సర్వమగును
ప్రేమతో మంటఁగలిసెడు క్రిములు మనకుఁ
గఱవునీతిని బూర్తిగాఁ గడకునెపుడు. 20

(గీతమాలిక)

అందమగు తేజమునుగాంచి యద్భుతంబు
జెంది కీటకము తుదకుజెడియు జూపు
మంటఁగలసియు నశియించు మఱియునటుల
ప్రేమపూరితమగు నాత్మ వెలుగుచుండ
నీచమగు నహంభావము నిజముగాను
దగ్ధమైపోవుఁ జేరియు దానియందు 21

గీతమాలిక

బిచ్చగానికి సుఖమెట్లువచ్చు నెపుడు?
ధర్మమున కర్త్రతగలుగు దానినెపుడు

దానమీయక దానిని దాచియుంచ
నేమిఫలితము చేకూరు? నిలనునీకు
నీదుహృదయము ప్రేమచే నిండియున్నఁ
బ్రతిఫలము గోరకుండియుఁ బరులకిమ్ము
ఈయఁగలదాని నంతయు నెంచినీవు 22

(గీతమాలిక)

హద్దు లేని యాత్మకు నీవు ముద్దుగొల్పు
వారసుఁడ వగుటవలన వాస్తవముగ
నీహృదయమునందెకలదు నిక్కమైన
ప్రేమసార మనునదియుఁ గ్రియకుజూడ
నిమ్ము నీకున్నదంతయు నిమ్ముతుదకు
నిచ్చుప్రతిఫలమును గోర నింకిపోవు
ప్రేమసాగరమంతయు బిందువుగను 23

(గీతమాలిక)

బ్రహ్మ మొదలు క్రిమివఱకు స్వల్పమైన
యణువువఱకును గలయట్టి యంతు లేని
జీవ నిర్జీవ కోటిలోఁ జేరియుండు
నతఁడె ప్రేమస్వరూపు డెౌనట్టి ప్రభువు,
దైవము, భగవంతుడు గూడ దానిఁబట్టి
మిత్రమా! నీవువాని పవిత్రమైన
పదములందును నీదగుహృదయమాత్మ
మానసముల నర్పింపుము పూనిప్రేమ 24

(గీతమాలిక)

కలవు నీముందు వానికిఁ గలిగియుండు
పెక్కురూపము లీరీతిఁ బ్రబ్బియుండుఁ
గణనఁజేయక వానిని గడకు నీకు
దైవమునుగాంచఁ గలుగుట తరముకాదు
వెదకిచూచిన నెచ్చోట వెడలి నీవు
భేదభావమును విడిచి ప్రేమతోడ
సకలజీవుల కెల్లను సమముగాను
సేవఁజేసిన మనుజుఁడే చివర కెపుడు,
దైవమును బూజఁజేసిన దానిఫలము
నొందగల్గును నిజముగా నుర్వియందు. 25

## ప్రబుద్ధ భారత పత్రికకు హెచ్చరిక

(గీతమాలిక)

మేలుకొను మింక నొకసారి మేలుకొనుము
నీకు మృత్యువు కా దది నిజముగాను
క్రొత్తజీవితమును సమకూర్పనదియు
నీకు విశ్రాంతి నొసగెడు నిద్రయగును
కంజదళములఁ బోలు నీ కన్నులకును
సాహసంబగు దృశ్యము ల్చాలఁగాంచ
బలముఁగూర్ప విశ్రాంతియై పఱగుచుండు
వేచియున్నది లోకము వేగిరముగ
నిన్ను మరలగాంచ నిపుడు నిశ్చయముగ
సత్యమా! నీకు లేదుండు మృత్యు వెపుడు. 1

(గీతమాలిక)

బాటప్రక్కను గ్రిందుగాఁ బడియు నుండు
ధూళిఁజెదరంగ గొట్టక తుదకుశాంతి
కెట్టిభంగము లేకుండునట్టి రీతి
నెమ్మదిగ నడ్గులిడుచును నీవు మఱల
నటులెపొమ్మింక బలము సాహసము నిశ్చ
లత్వమానందముల గూడి లలితమైన
స్వేచ్ఛతోనీవు ముందుకు సేమమొప్ప
సాగుము ప్రబుద్ధ భారతీ! సాగుమింకఁ
బరులహృదయములను గదల్పఁగనుజాలు
పలుకులను బల్కుచుండియు మఱలుమీవు. 2

(గీతమాలిక)

ప్రేమహృదయులు నిన్నుంచి పెంచిరెచట?
నీదువృద్ధిని గాంచియు నెచటవారు
వెల్లడించిరో సంతోష? మెల్లనట్టి
నీ నివాసమిపుడిచటఁ గానరాదు.
కాని భావిగతి బలముగలిగియుండు
నదియు నీసృష్టిధర్మమై యలరుచుండు
సకలవస్తువులును గూడ జననమొందు
తావునకు మఱలబలము తగినరీతి
బొంది యేతెంచి యౌన్నత్య మందగల్గు. 3

(గీతమాలిక)

మేఘములు చుట్టియుండగ మెఱయుచుండు
మంచుఁగొండలు నిన్నుదీవించి క్రొత్త
వింతసమకూర్పఁ జాలెదునంతబలము
నీకిడుచునచ టవియుండు నెపుడుఁగూడ
నట్టి నీజన్మభూమియం దపుడునీవు
బయులుదేరుము క్రొత్తగా బలముఁజేరి
స్వర్గవాహిని యగుగంగ శ్రావ్యమైన
శాశ్వతంబగు గానము సలుపుచుండ
నీదుపలుకులు గొనిపోవు నిశ్చయముగ
నవియు దానిప్రవాహమునందుఁ గలిసి
వెంబడించును దానిని వివిధగతుల
దేవదారు వృక్షములెల్ల దివ్యమైన
నీడనిచ్చి శాశ్వతశాంతిఁ గూడనీకు
గలుగజేసి విశ్రాంతిని గలుగఁజేయు. 4

(గీతమాలిక)

అన్నిటికిఁ బైన వెలయుచు హైమవతిగ
నొప్పుహిమవంతుఁ బుత్రిక యుమయుఁగలదు
నిర్మలత్వపరిశాంతల నెగడునామె
శక్తివలెనుండి యన్నిట జగతియందు
నామెయే జగజ్జననిగా నలరుచుండు
సకలమగు పనులను జేయుశక్తియామె
లోకమంతయు సృజియించు లోకమాత

సత్యమార్గముఁ జూపెడు జననియామె
కృపనుజూపియు జనులకు నెపుడుఁగూడ
నొక్కఁడందఱిలోనుండె నిక్కమనుచు
దెలుపువారికిఁ బ్రేమతోఁ దేఁటపడఁగ
నలసటగలుగఁజేయని బలమునీకు
నామెయే సమకూర్చు నీయవనియందు
నంతులేనట్టి ప్రేమయే యదియుఁజుమ్మి. 5

(గీతమాలిక)

ఒక్కయుగమొక దేశము నిక్కముగను
తమదనుచుఁ జెప్పఁజాలని తాపసులును
జాతికిని మూలపురుషులై ఖ్యాతిఁగాంచి
హృదయమున సత్యమునుజూపి హితవుఁజూపి
మంచిచెడ్డలతోఁ గూడు మానవునకు
బోధఁజేసిరి ధైర్యముఁబూనివారు
వారిసేవకురాలవై వసుధయందు
"నుండెనొక్కటి యంతటనిండి" యనెడు
సత్యమగు రహస్యంబును సరిగనీవు
తెలిసికొంటివిపూర్తిగాఁ దెలివిఁగలిగి. 6

(గీతమాలిక)

ప్రేమరూపిణీ! పలుకుము ప్రియముగూర్చు
శాంతియుతమగు మృదువగు స్వరముతోడ
గాంచుదృశ్యము లెట్టులుగరగిపోయె

స్వప్నతుల్యములైనట్టి జగతులెన్నొ
శూన్యమును జేరుచుండుటఁ జూడనొక్క
సత్యమే దానిమహిమతో సరిగ నెపుడు
వెలుఁగుచుండుటచివరకుఁ దలపుమీవు. 7

(గీతమాలిక)

మఱియులోకమునకు నిట్లు మఱలమఱల
జాటుచుండుము సత్యముఁ దేటపడగ
"లెండునరులార ! మేల్కొనియుండుఁడింక
గలలఁగాంచకుఁడింకను గలలతోడ
నిండియుండియు నీభూమి మెండుగాను
నిచటఁగర్మమనునదియె యెపుడుఁగూడ
మంచిచెడ్డయూహాలనెల్ల నెంచివాని
తోడ దార మాధారముగూడ లేక
పూలదండలనిర్మించుఁ బూలదండ
మంచిచెడ్డవాసనలను మఱియుఁగలిగి
యుండుపూలతో నేర్పడీయుండు నటుల
నట్టియూహాలు శూన్యమునందుఁబుట్టి
వేరు మాత్రికలు వానికి వెదుక లేవు
అల్పమగుసత్యమును గూడ నట్టివాని
నాదిమూలమౌ శూన్యమునందుఁ జేర్చి
ధైర్యమునుబూని సత్యముదరికిఁ జేరి
కాంచి దానిని దానిలోఁగలియు డింక
గలలునశియింపఁజేయుఁడు కలలగనుట

నాపలేకుండియుండిన నపుడుమీరు
శాశ్వతంబగుప్రేమను జాలినంత
స్వేచ్ఛతోఁగూడియుండెడు సేవఁగూర్చు "
కలలుమాత్రముగాంచుడు గడకుమీరు. 8

## జె. జె. గుడ్విన్ కిచ్చిన హెచ్చరిక.

సాగు మోయాత్మ ! నీవింక సరసగతిని
నీదు తారాపథమునందు నిక్కముగను
నోయి యానందమూర్తి ! విధేయుఁడవయి
స్వేచ్ఛతోఁగూడు యోచనల్చివరవఱకు
నెచట నెలకొనియుండునో యచటనెపుడుఁ
గాలమవకాశములు నీదుగమ్యమునకు
నడ్డుతగులక యుండునో యచట కీవు
సాగిపొమ్మింక నాగక వేగముగను
శాశ్వతంబగు శాంతియు శక్తిఁ గూర్చు,
నాఁదుదీవనలునుగూడ నమ్మకముగ
నీకుఁ జెందియుండునుగాక నిశ్చయముగ, 1

(గీతమాలిక)

నీదు నిజమగు సేవయే నీవుచేయ
త్యాగమును బూర్తిచేయును ధరణియందు
ప్రేమపూరితహృదయమే వెల్లివిరిసి
నీదుగమ్యముఁ జూపును నీకునెపుడు
నీదుతావునకు వెనుక నిండియుండు

మృదువగు గులాబిపూవుల మెత్తరీతి
శ్రావ్యమగునట్టిదానిదౌ జ్ఞప్తియెపుడు
కాలమవకాశములఁ జంపుఁగడకుఁజూడ. 2

(గీతమాలిక)

నీదుబంధములు తెగియె నిజముగాను
నిర్మలానందశోధన నీకు ముగిసె
జీవితమరణముల నవి చేరియేది
యొకటిగా నుండెనో దానియునికితోడ
నీవుగూడ నేకమగుచు నెగడుచుంటి
విపుడు పృథ్వియందు జనుల కెపుడునీవు
స్వార్థమును వీడి సాయంబు సల్పుబూని
ప్రేమతో లోకమందలి పెక్కుకష్ట
ములను దొలగించి జనులకుఁ బూర్తిగాను
సాయపడుటకు ముందంజ వేయుమెపుడు 3

## ఖేతి మహారాజునకు హెచ్చరిక

(గీతము)

ఇనుని మేఘముగప్పిన నించుకంత
నంధకారము గ్రమ్మిన నాకసమున
బూనిన పనిని వీడక పూర్తిచేయు
మయ్య! ధీరహృదయ! జయమగును నీకు 1

(గీతమాలిక)

వేసవియునేడు కాలము వెంటరాకు
శీతకాల ముండక యుండుఁ జెంతఁబల్ల
మనెడునది లేక యుండదేయిలయు గూడ
బల్లముండినఁ గెరటము బయలుపడును
నీడ వెలుతురులవలెను గూడనవియు
నొకటితర్వాత వచ్చు వేరొకటి యెపుడు
జలన మొందక యవ్వాని చందమునను
ధైర్యముగలిగి నిలువుము ధరణియందు 2

(గీతమాలిక)

జీవితపుధర్మములు పెద్దచెదునుగూర్చి
బాధకరములై యుండును వసుధయందు
అల్పకాలికమగు భోగ మవనియందు
గమ్య మస్పష్టమై యుండు గడకుఁజేర,
గాన ధీరహృదయ! యంధకారమందు
సాగిపొమ్మింక ముందుకు శక్తి జూపి 3

(గీతమాలిక)

చేసినపనియుఁ గష్టము ల్చివరకెపుడు
వ్యర్థములుగావు శక్తులు పాడువడిన
యాశలెల్లను బొందిన నాశనంబు

వీరుఁడవుగమ్ము నీయొక్క వారసులును
వీరులగుదురు నీకును విజయమబ్బు
చేసియుండిన మేలెప్డుఁ జెడదుసుమ్మి
కాన ధీరహృదయ! నీవుపూనుపనిని
సాహసముతోడఁ జేయుము సౌఖ్యమబ్బు. 4

(గీతమాలిక)

మంచివారలు జ్ఞానులనెంచ భువిని
స్వల్పసంఖ్యగనుందురు వారుజనుల
నడుపుచుందురుగాని యానరులువారి
విలువను గ్రహింపజాలరు తెలివిలేక
యెవ్వరిని లక్ష్యపెట్టక యెపుడునీవు
నెమ్మదిగ నడుపుము కడునెమ్మిఁజూపి. 5

(గీతమాలిక)

దూరముననుండువారు నీతోడనుంద్రు
సర్వశక్తియుతుఁడగు నాసర్వమయుఁడు
ప్రభువు నీచెంతనుండును వాస్తవముగ
నోమహాత్మ! దీవనలెల్ల నొక్కమాఱు
పడుచు నీపైన వర్షముపడెడురీతి
జయముఁగూర్చును నీకెప్డుఁజాలినంత. 6

## జూలై 4 వతేది

## (అమెరికాస్వాతంత్ర్యము ; స్వామి నిర్యాణము)

(గీతమాలిక)

దట్టముగ గూడి యూరేయి ధరణిఁగప్పి
శవము పైఁగప్పబడు గుడ్డచందమునను
కారు మేఘములు తుదకు వేరుపడుచుఁ
జెదరిపోవుట, గనుమింకఁ బిదపమతిశయముఁ
వింతయగు నీకిరణములు పృథ్విదాకు
ముందులోకము మేల్కాంచు ముందుగాను
పక్షులన్నియు నేకమై పాడసాగు
దారలనుబోలు పుష్పముల్ తలలనెత్తి.
మంచుబిందువులనుగూడి మించిశోభ
యిడును సుస్వాగతము నీకుఁ గడకునపుడు
తమసహస్రదళారవిందములతోడ
విస్తరించినకొలనులు ప్రేమఁజూపి
హృదయపూర్వక స్వాగత మిడునునీకు
మిగుల తేజస్స్వరూపుడ వగుటనీవు
ప్రభువరా! నీకు నెల్లరు భక్తిఁజూపి
వందనములిడుచుందురు ముందుగాను

స్వాగతము నీకు నిపుడు సుస్వాగతంబు
నీదుకిరణము లీనాడు నిజముగాను
స్వేచ్ఛనిచ్చును జనులకు స్థిరముగాను
సూర్యభగవానుఁడా! కడుశోభఁగూర్చి 1

(గీతమాలిక)

వేచియుండెను లోకంబు వెదకెనిన్ను
దేశకాలంబులనుబట్టి తెలివి లేక
కొందఱు గృహములనువీడి, కొందఱుతమ
ప్రాణమిత్రులవీడియుఁ బడయనిన్ను
జింతఁగూరుచు సాగరసీమలందు
నడవిప్రాంతములందును బిడియపడక
చాలశ్రమకోర్చి సిద్ధమైచావునకును
నిన్ను వెదుకంగఁబోసాగి రన్ని దిశల
వారుచేసినకృషికిని ఫలితమిచ్చు
దినముచివరకు నేతెంచెఁ గనఁగవారు
ప్రేమ సేవయుత్యాగము క్రియకు ఫలము
నిచ్చి కార్యసాఫల్యమై మెచ్చదగిన
యట్టియాస్వేచ్ఛ లభియించెఁ గట్టకడకు
స్వేచ్ఛ తేజము ప్రబలమై శిరివిగాను
నీవు వెదచల్లినాడవు నిజముగాను. 2

(గీతమాలిక)

నీదుమధ్యాహ్న కాంతిచే నిక్కముగను
లోకమంతయు వెలుగుచు లోకమందు
నుండు దేశములన్నియు నిందుకాంతి
ప్రతిఫలింపఁగఁ జేయుచు వఱలుచుండ
స్త్రీలు పురుషులు నీవైపు చేతులెత్తి
నీకు వందనములఁ జేసి యేకరీతి
నిన్నుఁ గొనియాడువఱకును నిశ్చయముగ
వారి బానిసత్వముపోయి వారికుండు
బంధములు పూర్తిగాఁ ద్రెంపఁబడిన వంచు
దెలిసి నూతనబలముతోఁ దిరిగి క్రొత్త
జీవితము ప్రాప్తమగుటచేఁ జెప్పరాని
సంతసము పొంగిపొరలెడునంతవఱకు
నడ్డులేని నీమార్గమునందు నీవు
కదలిపొమ్మింక ప్రభువరా! ముద మొసఁగుము. 3

సమాప్తము

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము



రచయిత

కవిశేఖర, శతావధాని, మధ్వశ్రీ

## పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

గుంటూరు హిందూకళాశాలాసంస్కృతాధ్యాపకులు

★

ప్రకాశకులు :

వేంకట్రామ అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

పూర్ణప్రజ్ఞ గ్రంథమాల - ద్వితీయకుసుమము

శ్రీ హయగ్రీవాయనమః

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

ఇది

శ్రీ భాసమహాకవి సంస్కృతనాటిక కాంధ్రానువాదము


రచయిత :

కవిశేఖర మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

(గుంటూరు హిందూకళాశాల సంస్కృతాధ్యాపకులు)



—: ప్రకాశకులు :—

వేంకట్రామ అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు

బెజవాడ - మద్రాసు

1947

శ్రీహయగ్రీవాయనమః

# విజ్ఞప్తి

(ద్వితీయ ముద్రణమునకు)

తెనాలితాలూకామూల్పూరువాస్తవ్యుఁడు, భూస్వామి ఉదారుఁడు, వృద్ధికాముఁడు నగుమద్భాగినేయుఁడుచిరంజీవి శ్రీ మానూరువేంకటరమణారావు మద్గ్రంథంబులలో నొక్కదానిని ముద్రింప ముచ్చటపడి సాదరంబుగా నా కొసంగినసద్ద్రవ్యముతో నే నీనాటికను 1947 సంవత్సరము మా పూర్ణప్రజ్ఞగ్రంథ మాలలో ద్వితీయ కుసుమముగాఁ దొలుసారి ప్రకటించితిని. భాసమహాకవి యందలి భక్తిచేతనేమి మద్గ్రంథమునందలి గుణలేశముచేతనేమి యనుపదమే యీనాటికను శ్రీఆంధ్ర విశ్వ విద్యాలయమువారు 1950 వ సంవత్సరమునకును, శ్రీ మద్రాసు యూనివర్సిటీవారు 1951 వ సంవత్సరమునకును ఇంటర్మీడియేటు పరీక్షకుఁ బాఠ్యగ్రంథముగా నిర్ణయించి ద్వితీయ ముద్రణావకాశమును వెంటనే కలిగించి మా గ్రంథ మాలను బ్రోత్సహించినందులకు ఉభయ విశ్వవిద్యాలయాధి కారులకును మత్కృతజ్ఞతాపూర్వకాభివందనముల నర్పించు చున్నాను.

నాయందభిమానముంచి యేతన్నాటికాపునర్ముద్రణము నకు రు 650 ఆఱువందలయేఁబది రూప్యముల నాకు విరాళ ముగా నొసఁగిన శ్రీ గుంటూరు రామచంద్రపురాగ్రహార సభవారికి నాధన్యవాదములు.

పై విధమున నాకును మద్గ్రంథమాలకును సర్వవిధములఁ దోడ్పడుచున్న విద్యాధికారులకు, గ్రంథ ప్రకాశకులకు, ఉదారులకు, అభిమానులకు, సహాయులకు, మిత్రులకు నా యభివందనములు.

ఇట్లు

15-10-54 ?

శ్రీహయగ్రీవాయనమః

# విజ్ఞప్తి

మామిత్రులగు శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యుల వారిపీఠికయే భాస, తన్నాటక ప్రాశస్త్యమును బహుభంగుల విశదీకరించుటం జేసి నాభారము చాలవఱకుం దగ్గినను సముదాచారానుసారము రెండువాక్యముల వ్రాయుచున్నాను.

శ్రీమహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రిగారి యముద్రిత గ్రంథాన్వేషణ కృషిఫలితముగా లభించిన భాసనాటక చక్రమును గాంచుభాగ్యము నాకు రమారమి యిరువదియైదు వత్సరములకుం బూర్వము గలిగినది. అప్పటి తన్నాటకాలోకన జనితానందమే నాకు 'ప్రతిమా, ప్రతిజ్ఞాయౌగంధరాయణ, చారుదత్త, దూతవాక్య, దూతఘటోత్కచ' నాటకాంధ్రీకరణములకు హేతువయ్యెను. ఉత్సాహము కలిగినప్పుడు గ్రంథములు వ్రాయుటయేగాని వానిం బ్రకటించుటయందు నా కంతగా దృష్టియుండెడిదిగాదు. కనుకనే కావ్యాలోక, శతలక్షణ్యాది గ్రంథము లెన్నియో మాతృకారూపమున నింటనే యున్నవి. ఇప్పటికేని కొందఱుమిత్రుల ప్రోత్సాహముతో నెలకొల్పంబడిన మా పూర్ణప్రజ్ఞ గ్రంథమాలలో ఈ ప్రతిజ్ఞా యౌగంధరాయణమును (నాటికను) ద్వితీయ కుసుమముగాం బ్రకటింపం గలిగినందులకు సంతసించుచున్నాను. ఆదరపూర్వకముగాం బీఠికవ్రాసియిచ్చిన యస్మత్ప్రియ మిత్రులకు ధన్యవాదములు. మా గ్రంథమాలయందుం బ్రత్యేకాభిమానముం జూపుచున్న మిత్రులకును, ప్రకాశకులకును, శ్రీ చంద్రికా ముద్రాలయాధిపతులకును నే నెంతయుం గృతజ్ఞుఁడను.

ఇట్లు, గ్రంథకర్త
పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు.

# పీఠిక

ప్రథితయశసాం భాససౌమిల్ల కవిపుత్త్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః.

సూత్రధార కృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ.

పైనుదాహరింపఁబడిన కాళిదాసబాణమహాకవుల వాక్యముల వలన భాసుని ప్రతిభావిశేష మూహింప వలసినదే గాని వ్రాయ నలవి గాదు. కవితా ప్రపంచమున కవికులగురుండును, గద్యరచనమున నిరవద్య విద్యాచణుఁడగు బాణుఁడును భాసునియందు సమాన ప్రతిపత్తి గల్గి యుండుట గమనింపఁదగిన విషయము.

1910 యవ సంవత్సరప్రాంతమున మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రులవా రీనాటకములను విద్వల్లోకమునకు వెలిఁబుచ్చిరి. అది మొదలుగా భాసకవిని గూర్చియు తత్కృతనాటక త్రయోదశిని గూర్చియు వాదప్రతివాదములు ప్రబలియుండుట పండితులెఱింగినదే. నాటకములు మిక్కిలి సంగ్రహముగా నుండుటవలనను సౌలభ్యాతిశయముగలిగి యుండుటవలనను పూర్వకవికృతములును విస్మృతములు నగునాటకములను రంగస్థలోచితముగా మలయాళమునందలి భరతపుత్త్రు లెత్తి వ్రాసికొనియుందురనియు తజ్జ్ఞులభిప్రాయపడుచున్నారు. ఈ పూర్వకవిభాసుఁడే కానోపు. రచన ననుసరించియు శైలియందలి యార్షభావమునుబట్టియు నీ నాటకములు తప్పక కాళిదాసునకుఁ బూర్వమునఁగల రూపకరంగమును సూచించు చున్నవనుట నిర్వివాదము.

శతానీకపుత్త్రుండగు నుదయనుఁడు క్రీ. వె. 6 వ శతాబ్దము నను ఐదవ శతాబ్దప్రారంభమునను వత్సవిషయము నేలిన వత్సరాజు. ఆకాలముననే భాసుఁడును గలఁడని యొకయభిప్రాయము. మృచ్ఛకటికమునఁగల పాలకుఁడును, మాగధుఁడగు దర్శకుఁడును, ఉజ్జయినీనాథుఁడగు ప్రద్యోతుఁడును సమకాలికులు. చారుదత్తనాటకమే

మృచ్ఛకటికముగాఁ బరిణమించినది. శూద్రకుఁడు క్రీ. శ. 2 వ శతాబ్దమునఁ గలఁడని నిరూపించిరి. పాణిని క్రీ. పూ. 6 లేక 7 వ శతాబ్దప్రాంతములఁ గలఁడని ఐతిహాసకసమ్మతి. భాసుని అపాణినీయ ప్రయోగముల ననుసరించియు, అర్ధకావ్య మగు శ్రీమద్రామాయణముతోఁ దులఁదూఁగఁగల శైలీసంవాదము ననుసరించియు, భాసుని కాలము క్రీస్తునకుఁ బూర్వము 4 లేక 5 వ శతాబ్దప్రాంతము గానోపును.

ఈనాటకములందు సౌలభ్య మనునది ప్రథమగుణము. ఔత్తర కాలికనాటకరంగమునఁ బ్రదర్శనయోగ్యము లయ్యును శబ్దార్థవైచిత్ర్యము గలిగి ప్రాచ్యపాశ్చాత్యఖండములందును నగ్రస్థానము వహించిన కాళిదాసనాటకములు మొదలుగా ప్రదర్శనమున కను కూలములు గానివియును శబ్దార్థాడంబరము గలిగి సుప్రసిద్ధ పాణినీయ ప్రయోగోదాహరణభూతము లగు భవభూతి, మురారి ప్రస్థానముల వఱకును గల శైలీభేదములు భాసునియం దించుకయును గానరావు. ఇంతియ గాక రంగస్థలమున నత్యంతరమణీయములును యామమాత్ర కాలమునఁ బ్రదర్శనార్హములు నగుట యీనాటకములందుఁ గల సామాన్యగుణసంపద. కావున దృశ్యకావ్యము లనుమాట యీనాటకములకే చెల్లినది. ఉత్తరనాటకరంగమున మృచ్ఛకటిక మొక్కటి దక్క తుల్యానుభావము గలనాటకము మచ్చునకైన దొరకదు. పాత్రములగమనిక సినిమారంగమునందువలె నతిశీఘ్ర మగుటయు రసస్ఫూర్తి గల్గి యుండియును పదాడంబరము లేక చర్వణానుకూల మగురీతి నొప్పారుటయును ఈరూపకములందుఁ గలయనన్యసామాన్య ధర్మము. కావున నతిప్రాచీనము లయ్యును బ్రకృతరంగమున కవి యెంతయు ననుకూలము లగుచున్నవి. "ఉదయనకథాకోవిదగ్రామవృద్ధాన్" అను మహాకవిపద్ధతి కనుగుణముగా నీనాటకములం దితిహాసవృత్తము లగు రామభారతకథలే గాక స్వప్నవాసవదత్తాప్రతిజ్ఞాయౌగంధరాయణములం దుదయనకథయుఁ గ్రోడీకరింపఁబడినది. ఆధునికనాటకమందలి పిచ్చివానిపాత్ర యౌగంధరాయణపాత్ర ననుసరించియే వ్రాయఁబడినది. మహావీరచరిత్రమునకు నుత్తరరామ

చరిత్రమునకుఁ గల సంబంధమే, ప్రతిజ్ఞాయౌగంధరాయణస్వప్నవాసవదత్తలకునుగలదనుట విమర్శకసంవేద్యము; రసములును వీర-(కరుణ విప్రలంభగర్భిత) శృంగారము లుభయమునకును సమానమే. పై యుదాహరణముల ననుసరించి యీనాటకము లుత్తరరూపకకర్తలకెట్లు మార్గదర్శకము లయ్యెనో పండితు లూహింపఁ గలరు.

ఈనాటకములందలి యితివృత్తములు ప్రఖ్యాతోత్పాద్యమిశ్ర భేదములు గల్గి రామభారతభాగవత కథాపీఠముల ననుసరించి స్వోపజ్ఞ మగు శైలిభేదముచే నల్లఁబడినవి.

బాలచరితమున శ్రీకృష్ణచేష్టితములును, మధ్యమవ్యాయోగ, పంచరాత్ర, దూతవాక్య, దూతఘటోత్కచ, కర్ణభారోరుభంగములఁ బాండవకథయు, ప్రతిమాభిషేకముల రామోదంతమును, ప్రతిజ్ఞా స్వప్నముల నుదయనేతివృత్తమును, అవిమారకచారుదత్తముల నుత్పాద్యవస్తువులును కూర్పఁబడి కవియొక్క సర్వంకష ప్రతిభాశాలిత్వమును, సర్వరసప్రపంచచంచుత్వమును వేనోళ్ళఁ జాటుచున్నవి. కాళిదాస భవభూతులందును ఇట్టిచతురశ్రనిర్మాణమార్మికతకలదా ? అనియును శంకింప వలసినట్లున్నవి గాదా యీరూపకములు ? ఇవి త్రయోదశ సంఖ్యాత్మికములయ్యును రసపూర్ణములే.

ప్రకృతనాటకమునందలి పాత్రౌచిత్యరసపోషణాదికావ్యగుణములను విస్తరించి వర్ణింపవలయుననిన నుపోద్ఘాతము విస్తరించుటయేగాక పాఠకలోకమున కేర్పడుస్వైరభావముల నరికట్టు ప్రయత్నమువంటి దగునేమో యని యట్టియుద్యమమునుండి విరమించుచున్నాను.

గ్రంథకర్తలగు మధ్వశ్రీ పూర్ణప్రజ్ఞులు సార్థకనామధేయులు, నాంధ్ర విద్వల్లోకమున కతిపరిచితులు నగుట వారిని పాఠకులకుఁ బరిచితులనుగా నొనర్ప యత్నించుట కేవల మనుభవపునరుక్తి యగును. అయినను నూతనవిద్యార్థులకుఁ గొంత యెఱింగించుటయు యుక్తమే. వీరు బాల్యమునందె శబ్దశాస్త్రనిష్ణాతులై యష్టావధాన, శతావధానముల నొనరించి కావ్యనాటకనిర్మాణమున నుభయ

భావలందును బంచాశదధిక గ్రంథముల రచించిరి. శ్రీరామకళ్యాణమే వీరి ప్రథమ ప్రయత్న మగునచో వీరి ప్రతిభావిశేషము చాలవఱకును జెప్పినట్లే యగును. పరిణతదశ నందిన కాదంబరీకవిత యనర్ఘమము గదా. ముద్రిత గ్రంథములగు ద్విపదమేఘసూత్ర కైకేయీ సౌశీల్యాదులాంధ్రుల కదివఱకే సుపరిచితములు. కావ్యాలోక శతలక్షణ్యాద్యనేక గ్రంథము లింకను ముద్రణాలయమును జొఱకున్నవి. భాసుని సాలభ్యాతిశయమునకు మెఱుఁగు వెట్టినట్లున్న దీయాంధ్రీకరణము. స్థాలీపులాకన్యాయముగా ఈ క్రింది శ్లోకమున కాంధ్రీకరణమును బరిశీలింపుఁడు.

శ్లో॥ కాష్ఠాదగ్నిర్జాయతే మథ్యమానాత్ భూమిస్తోయం ఖన్యమానాదదాతి
సోత్సాహానాంనా స్త్యసాధ్యంనరాణాం మార్గారబ్ధాః సర్వయత్నాః ఫలంతి.

అం-1-శ్లో-18

గీ. రాయుచోఁ గట్టెనుండియు రాలు నిప్పు త్రవ్వుచో నీ రొసంగును ధరణి యేని
కా దసాధ్య ముత్సాహుల కేది కూడఁదలఁ నొనర్చ ఫలించు యత్నంబు లెల్ల.

శ్రీయాచార్యులవారు నాకుఁ జిరపరిచితు లగుటయే గాక మిత్రులును గౌరవపాత్రులు నగుటచే వీరి నామస్మరణము నాహర్ష చరిత్రమున వ్యంగముగా నొనరించియుంటిని.

"స్వాదుకాంబరీరసాస్వాదమునను బూర్ణమగు ప్రజ్ఞ వాయని బుధవరులను, శాబ్దికులఁ గావ్యవేత్తల సరసకవుల లాక్షణికులను దలఁతు సలక్షణముగ". (1-7 ఆంధ్రహర్షచరిత్రము)

ప్రస్తుతము పీఠికామిషమున మరల వీరియుత్కర్షమును బరిమితముగాఁ బచరింపఁ గల భాగ్యము నా కొదవించినందులకు కృతికర్తల కెంతయుఁ గృతజ్ఞుఁడను. శ్రియఃపతి వీరి కాయురారోగ్యసంపదల నొసంగును గాక యని యభిలషించుచు నింతటితో నాపీఠిక ముగించుచున్నాను.

గుంటూరు,
25—5—47.

కొమాండూరు కృష్ణమాచార్యులు,
Retd.) Lecturer, A. C. College, Guntur.

# ఈనాటికయందుండు పాత్రములు

## పురుషులు

యౌగంధరాయణుఁడు – వత్సరాజుగారి ప్రధానమంత్రి

సాలకుఁడు }
నిర్ముండకుఁడు } యౌగంధరాయణుని చారపురుషులు

హంసకుఁడు – వత్సరాజునకు నిత్యసన్నిహితుఁడగు పరిచారకుఁడు

బ్రాహ్మణుఁడు – యౌగంధరాయణుని మిత్రుఁడు

కాంచుకీయుఁడు } మహాసేనమహారాజుగారి యంతఃపుర పరిచారికుఁడగు బాదరాయణుఁడు

రాజు – } మహాసేన మహారాజు. వాసవదత్త తండ్రియగు ప్రద్యోతుఁడు

విదూషకుఁడు – వత్సరాజుగారి ప్రియవయస్యుఁడు వసంతకుఁడు

ఉన్మత్తకుఁడు – పిచ్చివేసముతోనున్న యౌగంధరాయణుఁడు

శ్రమణకుఁడు – బౌద్ధసన్యాసివేషముతోనున్న వత్సరాజుమంత్రి

రుమణ్వంతుఁడు – వత్సరాజ సచివుఁడు – శ్రమణకవేషధారి

భటుఁడు – మహాసేన భృత్యుఁడు

గాత్రసేవకుఁడు – వాసవదత్తావాహనమగు భద్రవతికిఁ బరిచారకుఁడు

సాధారణభటులు (ఇరువురు) – మహాసేనుని భటులు.

భరతరోహకుఁడు – మహాసేనుని ముఖ్యమంత్రి

శాలంకాయనుఁడు – మహాసేనుని సచివుఁడు

## స్త్రీలు

విజయ – వత్సరాజగృహమున ద్వారపాలిక (ప్రతీహారి)

దేవి – మహాసేనుని పట్టపురాణియగు అంగారవతి.

---

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞా యౌగంధరాయణము

## ప్రథమాంకము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్రధారుఁడు—

గీ. సేన మెల్లర కిడు మహాసేనుఁ డధిక
బలుఁడు వాసవదత్తోరుభద్రుఁ డెవుడు
వత్సరాజాభిధానుఁ డవార్యశక్తి (1)
రాజితుం డగుయౌగంధరాయణుండు॥

[నడచి తెరవైపు చూచి] ఆర్యురాలా! ఇటువచ్చెదవా ?

[ ప్రవేశించి ]

నటి:—ఆర్యా ! ఏమి సెలవు ?

సూత్ర:—నటీ ! ఏదే నొక్కదానింగూర్చి గాన మొనర్పుము. నీ గానమ్ముచే రంగస్థలంబు ప్రసన్న మగుడు మేమును నాటక ప్రయోగంబున కుపక్రమింతుము. నటీ ! ఆలోచించుచుంటి వేమి ? పాడెదవా ?

నటి:—ఆర్యా ? బంధుకులంబున నేదో యస్వస్థత వాటిలినట్లు నేఁడు కలఁగంటిని. కానఁ గుశల మెఱింగి వచ్చుటకు నెవరినైనఁ బంపఁ గోరెద.

సూత్ర—అట్లే యొనర్చెదను.

గీ. పురుషు నొక్కనిఁ బంపుదుఁ బూవుఁబోఁడి !
అఖిల మెఱిఁగినవాని హితాభిలాషి

[ తెరలో ]

సాలకా ! సిద్ధముగా నుంటివా ?

సూత్ర:—

అఖిల మెఱఁగినవాని సీతాభిలాషి
నదిగో యౌగంధరాయణుఁ జంపునట్లు.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

ఇది స్థాపన.

[పిమ్మట సాలకునితో యౌగంధరాయణుఁడు ప్రవేశించును ]

యౌగంధరాయణుఁడు:—సాలకా ! సిద్ధముగా నుంటివా ?

సాలకుఁడు:—ఆర్యా ! సిద్ధముగా నుంటిని.

యౌగం:—చాల దూరము పోవలయును జుమా.

సాల:—మహత్తరం బగుస్నేహంబుతోఁ గదా యేలినవారికడ సేవ చేయుచున్నాను.

యౌగం:—ఔను. అట్టిస్నేహంబుగల బలశాలియే గదా పోఁగలఁడు. వలయున

గీ. ఇహ వలయు దుష్కరవుఁ జెయ్యు నెపుడు స్నేహ
 భరితులందునో సత్కార నిరతులందో
 వారిసామర్థ్యమును దైవవశముచేతఁ
 జెడినఁ జెడు లేక యనుకూలపడినఁ బడును. 3

అట్లని నర్మదానదీతీరసమీపవర్తి యగు వేణువనంబు నంటి మూఁడరణ్యంబులు గలవు. వానిలో నాగవనంబునకు రేపు మహారాజుగారు వెడలుదురు. ఈలోపలనే నీవు శ్రీవారిని సందర్శింప వలయుఁజుమా.

సాల:—ఆర్యా ! మహారాజుగారికి మనవి చేయఁదగు విషయంబుల తోడిలేఖయే గదా నన్నుఁ బోనీయకున్నది.

యౌగం:—విజయా !

(ప్రవేశించి)

విజయ:—ఆర్యా! ఏమి సెలవు.

యౌగం:—లేఖను రత్నసూత్రమును త్వరితమ్ముగాఁ గొనిరమ్ము.

విజయ:—చిత్తము (నిష్క్రమించును.)

యౌగం:—సాలకా! నీవీమార్గము నెన్నఁడైనం జూచియుంటివా?

సాల—లేదు. వినియుంటిని.

యౌగం:—ఇదియు మేధావిలక్షణంబె. ఓయీ! ప్రద్యోతుఁడు వనగజప్రచ్ఛాదితశరీరం బగునీలగజంబు నొకదానిఁ గల్పించి మనప్రభువుగారిని వంచింపఁ దలంచుచున్నాఁడని నేఁడు విన వచ్చినది. మహారాజుగారిబుద్ధి యీపాటికే మోసమునఁ బడియుండ దనితలంతును. ఆహా! ప్రద్యోతునకు మా వత్సరాజువలన నెంత భయము! దీనివలన నాతని యక్షౌహిణులకు వత్సరాజుసైన్యముతోఁ బోరఁ జాలమి తెల్లమగును. ఏల యన.

> చ. బల మధికమ్మె కాని నరపాలురుపేదరము కాదు, పెరులుం
> గల రధికమ్ము కాదు నరకాంతులపై ననురక్తు, లందుచే
> ఛలమున వత్సరాజుఁ గొన సాహసి యయ్యెను వీడి యుద్ధవా
> ర్తలు; బల మెంత యున్న ననురాగము లేనిమొదన్ గళిత మౌ.

(ప్రవేశించి)

విజయ:—ఇదిగో లేఖ. రత్నసూత్రము సర్వాంతఃపురజన హస్తంబులనుండి తొందరింపఁబడుచుండె నని రాజమాతగారు సెలవిచ్చిరి.

యౌగం:—విజయా! సర్వాంతఃపురవధూకరస్పృష్టంబు గాని వేరొండు గాని రత్నసూత్రంబు వేగిర మొసంగుఁ డని రాజమాతగారికి మనవి చేయుము.

విజయ:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశించి)

నిర్ముండకుఁడు:—ఆర్యా! సుఖ మగుఁ గాక.

యౌగం:—ఏమీ నిర్ముండకుఁడా?

నిర్ముం:—ఆర్యా! మహారాజుగారిసన్నిహిత పరిచారకుం డగు హంస కుఁడు వచ్చియున్నాఁడు.

యౌగం:—ఏమీ! హంసకుఁడొక్కఁడే వచ్చె ననియా? సాలకా! ఒకముహూర్తంబు విశ్రమింపుము. అవసర మగునేనిఁ ద్వరిత మ్ముగా నైనఁ బోవచ్చును లేదేని విశ్రాంతినైన నందవచ్చును.

సాల:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—నిర్ముండకా! హంసకుని దోడ్కొని తెమ్ము.

నిర్ముం:—ఆర్యా! చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—ప్రభువుగారితో నవినాకృతుం డగుహంసకుఁ డిప్పుడే కాకియై వచ్చెనని వినుటచే నాచిత్త మెంతయుఁ దత్తఱ పడుచున్నది. ఏల యన.

సీ. కబురులం దెల్ప బందుగుల్ కాచి యుండ
పరిగి పరదేశ మిలు సేరుపరున కట్ల
ప్రియమె విందునొ యకట! యప్రియమె విందు
నో కదా యని శంకింప సాఁగె మనసు.

(పిదప హంసకుఁడు నిర్ముండకుఁడును బ్రవేశింతురు)

నిర్ముం:—ఆర్యా! ఇటు — ఇటు.

హంస:—ఆర్యయౌగంధరాయణు లెచ్చట నున్నా రెచ్చట నున్నారు?

నిర్ముం:—వీరే యార్యయౌగంధరాయణులు. సమీపింపుఁడు.

(నిష్క్రమించును)

హంస:—(సమీపించి) ఆర్యునకు సుఖ మగుఁగాక.

యౌగం:—హంసకా! మహారాజుగారు నాగవనంబునకుఁ బోలేదు కదా.

హంస:— ఆర్యా! మహారాజుగారు నిన్ననే నాగవనంబునకుఁ బోయినారు.

యౌగం:—అయ్యో! నిష్ఫలంబుగదా యిక సాలక ప్రేమణము. వంచితుల మైతిమి. ఇఁక నేమైనఁ దిరిగి యాశకలదా? లేక యిప్పుడే ప్రాణములఁ బాయ వచ్చునా?

హంస:—రాజుగారింతవఱకు జీవించియే యున్నారు.

యౌగం:—రాజుగారింతవఱకు జీవించియే యున్నారనుటచే నేలిన వారి కొకపాటియాపద గల్గినట్లు చెప్పినట్లయ్యె. మహారాజుగారు పట్టువడిరా? ఏమి.

హంస:—ఆర్యులు చక్కఁగ నూహించితిరి. అట్లే పట్టువడిరి.

యౌగం:—ఎట్లు. మహారాజుగారు పట్టువడిరా? ఆహా! ఎంత దుష్కరకృత్యంబుం బొనర్చిరి. నేఁటికిఁ బ్రద్యోతుని భాగ్యము ఫలించినది. నేఁటినుండియు వత్సరాజామాత్యుల కసమర్థతయు నపకీర్తియుఁ బ్రకటితంబు లగు. రాఁబోవు ననర్థంబులకు ముందే ప్రతీకారముఁ జింతించునా రుమణ్వంతుఁ డప్పు డెచ్చటకేగెను? ఆయాశ్వికసైన్య మప్పు డెందుండెను? ఏల యన

ఉ. స్వామియెడన్ సరాగ మతిసౌహృదనీతము సత్కులంబు వ్యా
యామపటిష్ఠపూర్వయనుయంబు గుణార్జవయుక్త మాశ్వికస్తోమము లంచ మీ నరులఁ జొచ్చెనో? దురమభూమి యాట న
ల్మెమ్ముల విచ్చెనో? రిపుసమూహ మెదుర్కొనలేమి నొచ్చెనో?

హంస:—మహారాజుగారు సమగ్రయోధబలపరివారు లేని యీయనర్థము మూడకయే పోయెడిది.

యౌగం:—ఏమీ! మహారాజుగారు సమగ్రయోధపరీతులు కారా?

హంస:—ఆర్యా! చిత్తగింపుఁడు.

యౌగం:—మార్గశ్రాంతిచే నీవును బడలియున్నావు. కూర్చుండుము.

ఆలేఖ = యంటు
పరిచ్ఛేదుడు = కేష్టుబడిపేవాడు

ప్రతిజ్ఞాయౌగంధరాయణము

హంస:—ఆర్యా! చిత్తము. (నూర్ఛ్వంశి)

ఆర్యా! చిత్తగింపుఁడు. మన మహారాజుగారు హాయసుఖదాయక మీకాల మని కించిదవశిష్ట యను రేయియందే యనుక రేవుదారిగ నర్మదానదిని దాటి వేణువనంబున నిజకళత్రంబునుంచి యాతపత్రమాత్ర పరిచ్ఛదుండై గజమృగయార్హ్యంబగు బలంబుతో మృగంబుల హాహారావంబులు పిక్కటిల్లు వీథినుండి నాగవనంబునకుఁ బ్రయాణమైరి.

యౌగం:—తరువాత తరువాత.

హంస:—తరువాత సూర్యుఁ డంపవేటుదూరంబున నుండఁ గొన్ని యోజనంబులు నడచి పోవ మదగంధిర పర్వతమునకు గోశమీావలఁ దటాకపంక్తోత్థితమై, యర్ధనిర్మిత, మనశ్శిలా లేపంబుంబలె భీమదర్శనం బగుగజయూథంబు మాదృష్టిపథంబునం బడియె.

నిర్మిత = కూర్పబడిన

యౌగం:— తరువాత తరువాత.

హంస:—తరువాత మనసేనలు తదేకదృష్టితోఁ జూచుచుండ నాగజయూథంబు భయం బుప్పతిల్ల నొక్కెడ గుమిగూడె - అప్పుడీయనర్థంబునకు మూలకంద మగు నొకభటుండు మహారాజుగారిచెంతకు వచ్చెను. ప్రధాన సేనాపతి.

యౌగం:—ఆఁపుము - ఆఁపుము. ఇచ్చటికిఁ గోశమాత్రదూరంబున మల్లికాలతాచ్ఛాదిత శరీరంబుతో నఖదంతశూన్యంబుగ నేకనీలంబగు నొకయేనుఁగు నాకగుపించెనని చెప్పలేదా?

హంస:—ఏమీా! ఆర్యున కంతయు నవగతమే. ఇంత జాగ్రదవస్థయందున్నను ఇట్టియనర్థ ముప్పతిల్లినది గదా.

యౌగం:—ఓయీా! జాగరూకుని కంటెను విధియే బలవత్తరమని యెఱుంగుము. తరువాత తరువాత.

హంస:— తరువాత బభ్రువుగారు నూఱు బంగారునాణెంబు లా నృశంసునకుం బసదనం బిచ్చి యుండఁబవిన నిట్లనియె. హస్తి శిక్షయందు నీలశ్వేతలమతను వను గజసార్వభౌమ మొంకు గల దని తొల్లి చదివియుంటిని. కావున మీరెల్ల రీగజయూ థంబున నప్రమత్తులరై మెలంగునది. నేను వీణామాత్ర ద్వితీయుఁడ నై యాగజేంద్రముం బట్టితెచ్చెదను అని.

యాగం:— అప్పుడు రుమణ్వంతుఁడు స్వామి నుపేక్షించెనా ?

హంస:— లేదు. లేదు. ఏలినవారిని బతిమాలుకొని రుమణ్వదమాత్యుఁ డిట్లు మనవి చేసెను.

రుమ. మహారాజా! ఐరావణాదిగజ గ్రహణంబును దేవరవారి పట్ల సాపపన్నంబు. కాని రక్షణ కళకల్యంబు లగుటం జేసి దేశాం తరంబులు సన్నిహితానరంబులై యుండును. అందును నిర ర్జులు దుష్కులీను లగుననార్యులు నివసింతురు. కావున గజ యూథయోగ్యపదాతివర్గంబుతోనే గాక సమగ్రసైన్యంబుతో మేన మందఱ మట కేగుదమే కాని దేవరవా రొంటరిగ నేగుట సమంజసము కాదు అని.

యాగం:— రుమణ్వంతుఁడు మహాజనసమక్షమునందే మహారాజు గారితో నిట్లు మనవి చేసెనా? అట్లేని యాతనిప్రభుభక్తి నిరుప మనియే తలంతును. తరువాత — తరువాత,

హంస:— తరువాత మహారాజుగారు తన్నట్లు వారించెను రుమణ్వం తుని దనప్రాణంబులపై నొట్టిడుకొని నివారించి నీలవలాహక మనునేనుంగు డిగి సుందరపాటలనామకహయరత్న మధిరో హించి యంబరమణి నభోమధ్యంబు చేరక మున్న యిరువది మంది భటులు వెంట రాఁ బ్రయాణ మైరి.

యాగం:— విజయంబునకా ? — ఛీ, గజగ్రహణకుతూహలంబునఁ బ్రద్యోతునివంచనోద్యమంబు దలంపఁ డాయె. తరువాత — తరువాత.

హాంస:—తరువాత ద్విగుణమాత్రంబుగ మార్గంబు గమించి యొక్కచో సాలవృక్షచ్ఛాయయందు వృక్షసావర్ణ్యంబున దేహనీలిమం బ్రత్యక్షము కనుంగొనరాక తళతళ మెఱయుచు నశరీరనిష్ఠ్యంబులం బోలెం బొలుచు చతుర్దంతములతో నాదివ్యవారణ ప్రతికృతి ధనుశ్శత ప్రమాణ దూరంబున మా కగుపించె.

యౌగం:—హాంసకా! అది దివ్యవారణ ప్రతికృతి గాదు మాసంతాపాకృతి యని నుడువుము. తరువాత — తరువాత.

హాంస:- తరువాత మహారాజుగారు గుఱ్ఱంబు డిగి దేవతాప్రణామం బొనర్చి వీణం గైకొనిరి. అంత నాదివ్యవారణప్రతికృతికి వెనుక గజనిశ్చయంబునం బోలె నొకకంఠీరవంబు గానిపించె.

యౌగం:—సింహమా? తరువాత తరువాత.

హాంస:—తరువాత సింహాన్వేషణార్థమై యమ్మగ్గు దరిగితిమి. అప్పుడు మహామాత్రప్రధానాయుధీయులతో నిండియున్నయాకృత్రిమ వారణంబు మెల్ల మెల్లగా మహీవల్లభు నెదుర్కొనియె.

యౌగం:—తరువాత — తరువాత.

హాంస:—తరువాత మనప్రభువుగారు తనకుం దోడుగా వచ్చిన సత్కుల ప్రసూతు లగు యోధనరుల నామగోత్రపురస్సరముగాం బేర్కొని యోదార్చి యిది యంతయుం బ్రద్యోతుని కపటప్రయోగము. మీ రెల్లరు నన్ను వెంబడింపుండు. నే నిప్పుడే యీప్రద్యోతుని విషమం బగు ఛలప్రయోగంబు నస్మత్పరాక్రమంబుచే సమం బొనర్తు నని నుడివి వెంటనే పర బలంబుం బ్రవేశించిరి.

యౌగం:— పరబలంబును బ్రవేశించెనా? ఏమి చేయును?

గీ. వైరివంచనచే సిగ్గు వడియె, మాని,
సత్వసముపేతుం డెంతయు శౌర్యశాలి
ఒకరుడు శత్రుసన్నిధి నుండె; నింక
నెదిరిబలమును జొరకఁ జేఁ డేమి సేయు ?

తరువాత - తరువాత

హంస - ఆత్మాభిప్రాయానువర్తి యగుసుందరపాటలం బను నా
హాయరత్నంబుపైఁ గ్రీడించువాఁడుం బోలెఁ దనమనంబున
నున్నంతకన్న మిన్నగఁ బరబలంబు నుఱుమాడుచు వైరి
బలంబు బహుళం భగ్నటం జేసి యత్యంతము కాయక్లేశ
మందుచు విషణ్ణనష్టసకలపరివారుండై యేకాకి నగునాచే -
కాదు కాదు - తనచేతనే తాను రక్షించుకొనఁ బడుచుఁ
బగ లంతయు నెడతెగక యాల మొనరించుటం జేసి డస్సి
వైరిప్రహారంబులచే హాయంబు గూల సూర్యాస్తమయసమ
యంబున మనరాజుగారు మూర్ఛిల్లిరి.

యౌగం:—ఏమి ! మనరాజుగారు మూర్ఛిల్లిరా ? తరువాత
తరువాత

హంస:—తరువాత సమీపారణ్య ప్రదేశములనుండి యేజాతియో
తెలియని కొన్నికర్కశవల్లరుల శక్తిం గొలంది పెకలించుకొని
వచ్చి శరీరబంధనమున సామాన్యమానవునట్లు మహారాజు
గారు పరిభవింపఁబడిరి.

యౌగం:—ఏమీ ! మహారాజుగారు పరిభవింపఁబడిరా ?

సీ. మాంసలాత్యంతోన్నతాంసద్వయం బొప్పి
వ్యాయామ సువృథ పర్వములు గల్గి
నాగేంద్రహస్తంబు నగెడునాకృతి గల్గి
తగుదీర్ఘ వర్తులత్వములఁ దనరి
చాపసంస్ఫాలనశస్తహస్తము లొప్పి
వడి వడి శరము లెక్కిడుటఁ దెలిసి
సతతంబు విప్రపూజనశీల మొప్పారి
విహితులఁ గడు గారవించు టెటులఁ

గీ. శ్రీమలయుందున నాలింగనములచేతఁ
బొలుచు మావత్సభూపతిభూరిభుజయు
గళికిఁ దగిలించి మహాశక్తినమతులు
కంకణంబుల నిడుకోట కంకణలను.

హంసకా! తరువాత నెప్పటికి మహారాజుగారికిఁ దెలివి వచ్చినది.

హంస:—ఆర్యా! ఆపాపాత్ముల పని పూర్తియగునప్పటికి.

యౌగం:—అట్లేని అదృష్టంబుచే మహారాజుగారిశరీరమే పరిభూతమయ్యెఁ గాని తేజంబు గాదు. తరువాత – తరువాత

హంస:—తరువాత మహారాజుగారికి స్మృతి వచ్చుటఁ బరికించి యప్పాపు లీతఁడే మాయన్నం బన్న మొనరించె, కటకటా! ఈతండే మాతండ్రి నుసుఱులం బాయంజేసె, అక్కటా! ఇతఁడే నాకొడుకుఁ జక్కాడె, అయ్యో! ఈతఁడే నామిత్రు దుర్గతిపాత్రు నొనర్చె నని వేఱొకతీరునఁ బ్రభువుగారి విక్రమంబునే యభివర్ణించుచు నొక్కమాఱుగా మనతేని నెదుర్కొనిరి.

యౌగం:—తరువాత-తరువాత.

హంస:—తరువాత నాభయం బటులుండ రెండవభయం బొండు తారసిల్లె. ఒండొరుల ప్రోత్సాహంబున వారిలో నొక్కఁడొక యకార్యంబున కొడిగట్టి మనతేని దక్షిణాభిముఖు నొనర్చి కదనవ్యాపారంబునఁ జెదరినతలవెండ్రుకల నిరుపచారంబుగాఁ బ్రోవు చేసి పట్టుకొని కేలం గరవాలంబుఁ దాలిచి దానికిఁ గొంతయుసి యొసంగుటకై వెనుకకుఁ గొంతదవ్వు పరుగెత్తెను.

యౌగం:—హంసకా! ఈవృత్తాంతము కొంతసే పాపుము. అంతలో నేను తెప్పిఱిల్లుదును.

హంస:—తరువాత నానృశంసుఁడు రక్తప్రవాహపంకిలం బగు నమ్మహీతలంబునఁ దనవడిచేతనే కాళ్ళు తడఁబడ జాఱిపడి ప్రతిహతారంభుఁడై తనకత్తియ తనకు మిత్తిగాఁ బ్రాణంబులఁ బాసెను.

యౌగం:—ఈ పాపాత్ముఁడు ప్రాణంబులఁ బోసెనా ? ఆహా !

గీ. పరనృపులచేత నాక్రమింపఁ బడ కుండ
ధర్మసాంకర్య మెంతమాత్రంబు లేక
పాలితం బయి పుడమి తన్నేలుధరణి
పాలుఁ బాలింపుచుండు నాపదలయందు. (8) ౧౦

హంస:—తరువాత నేలినవారిచేఁ దోలుచోట్లనే బల్లెపుఁబోటున మూర్ఛిల్లిన శాలంకాయనుం డనుమహాసేనామాత్యుఁ డప్పుడే తెలిసి 'వల దీసాహసకార్యంబు వలదీసాహసకార్యం' బని యఱచుచుఁ దత్ప్రదేశంబునకు విచ్చేసె.

యౌగం:—తరువాత – తరువాత.

హంస:—అట్లు విచ్చేసిన పదపడి అయ్యమాత్యుండు మనతేనికిఁ దత్కాలదుర్లభం బగుప్రణామంబు గావించి బంధంబులనుండి విడిపించెను.

యౌగం:—మన ప్రభువుగారిని బంధసిర్ముక్తుఁ గావించెనా ? మేలు ! శాలంకాయనా ! మేలు ! దురవస్థ శత్రు నేనియు మిత్రకార్యరంబునకుఁ బురికొల్పును గదా. హంసకా ! ఇప్పుడు నాహృదయంబు వ్యసనంబునుండి యించుక యూఱడిల్లినదవ లెనున్నది. తరువాత నా సజ్జను డేమి చేసెను ?

హంస: —అంత నాప్రద్యోత సచివుండు సాదరంబుగఁ గొన్ని సాంత్వవచనంబుల నూఱడించి దెబ్బలు గాఢముగాఁ దగిలియుండుటచే వాహనంబుపైఁ గూర్చుండఁజాలరని స్కంధశయనంబుపై మనరాజుగారి నుజ్జయినికిం గొనిపోయెను.

యౌగం:—మనతేని నుజ్జయినికిఁ గొనిపోయెనా ! ఇదియే నుండి నే శంకించునదర్థము.

గీ. అపుడె నాతలపోయునవర్థ మిదియ
ఆ ప్రద్యోతుఁ డొండపకార్య మిదియ

ధీరచిత్తుండు కాన నీదృశము లైన
కష్టముల నెట్లొ జీవింపఁ గలిగె నేఁడు. ౧౧

ఇటుపై

శా. ఏరీతిం గను మాప్రభుండు మును లెక్క చేయఁ డాతని, నిం
కేరీతిన్ వినుఁ దత్కువాక్కులు సువాక్కై యెప్డు విన్వీనులన్
పోరే కల్గమి వ్యర్థ పౌరుష నెటుల్ పూనున్ మదిన్, నప్రుఁ డౌఁ
గా రుద్ధుం డొకవేళఁ జెందుతను సత్కారంబొ ధిక్కారమో. ౧౨

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రక్షాసూత్ర మిదిగో

యౌగం:—

గీ. అవసరం బేగ భాగ్యహైన్యమున నాయె
వితగమున పార్థితంబు లీప్రతిసరములు
రణము ముగిసినపై హాయ రాజమునకుఁ
జేయునీరాజనోత్సవ చిహ్నము లటు. ౧౩

ప్రతీ:—ఆర్యా! ఇదిగో రక్షాసూత్రము

యౌగం:—విజయా! ఉంచుము.

ప్రతీ:—రాజమాత కేమని విన్నవింపను?

యౌగం:—ఈలా గని.

ప్రతీ:—ఈలా గనఁగా.

యౌగం:—ఇట్లు,

ప్రతీ:—ఆర్యా! సెలవిండు సెలవిండు.

యౌగం:—(ఆత్మగతము) ఈ వృత్తాంతము దాఁచ శక్యముగాదు. రాజమాత కీవార్తఁ దెలియఁ జేసెదను. (ప్రకాశము) విజయా! మనస్సు గట్టిచేసికొనుము. (చెవిలో నేమో చెప్పును).

ప్రతీ:—అయ్యో! అయ్యో!

యౌగం:—నీవు విజయవు కదా. ధైర్యము వహింపుము.

ప్రతీ:—ఇదిగో పోయెదను. మందభాగ్యురాలను గదా!

యౌగం:—రాజమాతతో రాజుగారు బంధితులైరని యొకేమాటు విన్నవింపకు సుమా. స్నేహదుర్బలంబగు మాతృహృదయంబు నట్టేని రక్షింపవలయు.

ప్రతీ:—అట్లేని ఈ వృత్తాంత మెట్లు విన్నవింప మందురు.

యౌగం:—వినుము.

మ. తొలుదొల్లం బలుసందియంబులకు సుద్బోధంబుగా నెవ్వియో
పలుకంగా వలె యుద్ధదోషముల న్మాపై నామె సందిగ్ధయై
తలపోయం దనపట్టి కయ్యశుభ మాత్మన్ దుఃఖ ముప్పొంగఁగాఁ
గలరూపంబు తెఱంగు నేర్పుమెయి వక్కాణింప నా శక్తితోన్. ౧౪

ప్రతీ:—గ్రహించితిని. (నిష్క్రమించును)

యౌగం:—హంసకా ! నీ వపుడు స్వామితోఁ గూడ నేల పోవైతివి ?

హంస:—దేవా ! నే నప్పుడు మహారాజుగారిని వెంబడించి నాయాత్మను గృతార్థ మొనర్చుకొన నుద్యుక్తుఁడ నైతిని గాని శాలంకాయనుం డీవృత్తాంతమును గౌశాంబీనగరంబునఁ దెలుప నన్నుఁ బంచెను.

యౌగం:—శాలంకాయనుం డిట్లేల చేయును? లాభము లేదను నిరాశతో రాజుగారు పంప మానిన యీవృత్తాంతమును స్వామిభక్తిచే నిటఁ బంపఁ దలంచెనా ? లేక అనురక్తుండగు భటుండు రాజుకడ నుండుట యపాయ మని నిన్నుఁ బరిహరించుటకుఁ గా నిట్లు పన్నియుండునా ?

హంస:—అవును. నన్ను బరిహరించుటకే యట్లు పన్నియుండును.

యౌగం:—లేక – ఆశాలంకాయనుండు గర్వంబుచేఁ దనబుద్ధిసామర్థ్యమును గౌశాంబీజనులకుఁ జాట నెంచెనా ? అదియుఁ గాదేనిఁ దనయుద్యమంబు ఫలించెనని యిట్లానందించు చున్నాఁడా? కానిమ్ము. హంసకా ! నన్నుగూర్చి మహారాజుగా రేమియుఁ జెప్పియుండ లేదా ?

హంస:—ఆర్యా! చెప్పియుండ లేమి? శాలంకాయనుం డట్లు కౌ
శాంబి కేగి యీ వృత్తాంత మెఱింగింపు మని నన్నుఁ బంచిన
పదపడి నేను ప్రయాణము కాఁబోవుచు నేలినవారికిఁ బ్రద
క్షిణంబు గావింప నంతర్బాష్పాకలితలోచనంబులతో నాతో
నేదియో యెక్కువగాఁ జెప్పనుంకించియు స్తంభితకంఠు లగు
టచే మాట రాక కాఁబోలు మహారాజుగారు హంసకా!
హామ్మ. యౌగంధ (సగమనియాఁపెను.)

యౌగం:—హంసకా! నన్నుఁ బేరితో బిలుచుచుంటి నని సంశయిం
పకుము. నిశ్శంకముగాఁ జెప్పుము. ఇయ్యది స్వామివాక్యము
గదా.

హంస:—యౌగంధరాయణుఁ జూడుమనిరి.

యౌగం:—ఉండుము. ఏ మనిరి? తక్కినమంత్రి మండలము నెల్ల
నటుంచి యౌగంధరాయణునే చూడు మనిరా?

హంస:—దేవా! చిత్తము.

యౌగం:—ఇట్టియిక్కట్టు కలుగక మున్నే తగుప్రతీకారము
గావింపఁ జాలని యీయదూరదర్శిని — నిరర్థకముగా నింత
కాలమునుండి రాజాన్న మారగించు నీనిరర్థకజీవనుని — నిరుప
యోగంబుగా నిన్నినాళ్ళనుండి రాచమన్ననల నందుచున్న
యీవ్యర్థుని — నన్నుఁ జూడవలయు నని రాజుగారు తలం
చిరా?

హంస:—చిత్తము.

యౌగం:—అట్లేని మాఱురూపంబుతోడి నన్ను స్వామి చూడఁ
గలఁడు.

చ. అరినగరంబునందో చెఱయందో యరణ్యమునందో లేక దు
ర్భరతర వేదనం దనువుఁ బాసినచోఁ బరలోకమందునో
కరము జయంబుఁ గొంటి నని గర్వితు నాన్నృపు మోసగించుచో
నిగనిజరాజ్యమై భవముఁ జేకొని శ్లాఘ్యతఁ బార్శ్వమందునో ౧౫

(తెరలో)

హా! ప్రాణేశ్వరా! హా! ప్రాణేశ్వరా!

యౌగం:—

క. శోకమున కిదిగో స్త్రీలు ప్ర
తీకార మొనర్తు రిట్లు దీనికె కాదీ
శోకం బగుఁ బో మంత్రుల
ప్రాకట సామర్థ్య హైన్య వర్ణనముల్ గా. (11)

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రాజమాతగారు

యౌగం:—ఏమి? ఏమి?

ప్రతీ:—ఇట్లుమనవిచేయుచున్నది.

యౌగం:—ఎట్లు?

ప్రతీ:—సుహృజ్జనపరిగృహీతుం డగు నా వత్సరాజువృత్తాంత మి ట్లాయెఁ గదా ఇప్పుడు వైరనిర్యాతనంబుకన్నఁ గర్తవ్య మొండేమి యుండును. సుహృజ్జనంబుతో సంప్రతించి నిర్ధా రింపఁ దగును. ఎవ్వఁడు మహాసంకటంబులసైతము కటకటం బడఁడో, ఎవ్వఁడు విషమగతుం డయ్యు వెన్నుదీయఁడో, ఎవ్వఁడు వంచితుం డయ్యు నిర్విణ్ణుఁడు గాఁడో, ఎవఁడు ప్రతి ఘాతంబులసైతము ప్రాణంబులఁ బాయఁడో యట్టిబుద్ధిమం తుని గదా యడుగుచుంటిని. తొలుదొల్త మత్కుమారునకు వయస్యుండవును బదపడి యమాత్యుండవునగు పుత్రికా! మత్పుత్రకుఁ గొనిరమ్ము అని.

యౌగం:—అహా! ఈపూజ్యురాలు రాజకులోచితంబుగా గంభీర ముగఁ బల్కినది. ఈయమ సంభావనను బహూకరింతును. విజయా! నీరముఁ గొని రమ్ము.

ప్రతీ:—అయ్యా! చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఇదిగో నీరము.

యౌగం:—తెమ్ము. (ఆచమించి) విజయా! పూజ్యురాలకు రాజమాత యేమి చెప్పెను?

ప్రతీ:—పుత్రకా! మత్పుత్రకుఁ గొనిరమ్ము – అని

యౌగం:—హంసకా! ప్రభువుగారే మనిరి?

హంస:—యౌగంధరాయణుఁ జూడుము – అని.

యౌగం:—విజయా!

గీ. రాహుసంగ్రస్తుఁడౌ ద్విజరాజుఁ బోలె
వైరిసంగ్రస్తుఁ డైనయావత్సరాజు
విడిచి పెట్టింప లేనేని బిలువ వలదు
నన్ను యౌగంధరాయణుఁ డన్నపేర. ౧౩

(ప్రవేశించి)

నిర్మండకుఁడు:—ఆర్యా! ఒకయద్భుతకృత్యము జరిగినది: మహారాజుగారి దుర్దైవశాంతినిమిత్తము జరుగుసంతర్పణమున భోజన మొనర్చు బ్రాహ్మణజనంబుఁ జూచి యున్మత్తవేషధారి యగునొకద్విజుండు పెద్దగానవ్వి – 'తినుండు తినుండు మీ యిష్టము వచ్చినట్లు తినుండు. దీన నీ రాజకులంబున కభ్యుదయమే లెం' డని యంతలోనే యంతర్హితుం డాయెను.

యౌగం:—నిజముగా?

(తరువాత బ్రాహ్మణుఁడు ప్రవేశించును)

బ్రాహ్మణుఁడు:— ఇవిగో యున్మత్తవేషధారి యగునాబ్రాహ్మణుఁ డుపయోగించుకొని పనితీరుపై వదలిపెట్టి పోయినదుస్తులు, ఈదుస్తుల ధరించి భగవానుం డగుద్వైపాయనుండు వచ్చి యున్నాఁడు.

యౌగం:—ఎట్లు! ద్వైపాయనుండు వచ్చియున్నాఁడా?

బ్రాహ్మ:—ఔను.

యౌగం:—అట్లేని ఆమహామహుని జూచెదను.

బ్రాహ్మ:—చూడుఁడు.

యౌగం:—ఏమిది రూపాంతరమువలెఁ గన్పట్టుచున్నది. అహా! ఇప్పుడు నాకిప్పుడు స్వామిసన్నిధి కరిగినట్లే యున్నది. ఈయుపకరణంబుల ధరించి రిపునగరంబున నిర్భయంబుగా సంచరింపు మని యుపదేశింపనే కాఁబోలు భగవానుండగు బాదరాయణుఁ డీదుస్తుల నాకుఁ బ్రసాదించినాఁడు.

గీ. మదుపదేశంబు కొలఁది యున్న త్తవేష
మూని యేతెంచె నిప్డు డీమానివరుఁడు
రాజు విడిపింపఁ గలఁ డరిరాజ్యమందుఁ
గాన రాకుండ నడిపింపఁ గలఁడు నన్ను. ౧౮

(ప్రవేశించి)

ప్రతీహారి:—ఆర్యా! రాజమాతగారు "పుత్రకు నొక్కమాఱుచూడఁ గోరెద" నని పలుకుచున్నారు.

యౌగం:—ఇదిగో వచ్చుచున్నాను. ఆర్యా! శాంతిగృహమున నాకై వేచియుండుము.

బ్రాహ్మ:—చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—హంసకా! నీవు విశ్రమింపుము.

హంస:—చిత్తము. (నిష్క్రమించును)

యౌగం:—విజయా! ముందు నడువుము.

ప్రతీ:—చిత్తము. (ముందునడుచును)

యౌగం:—ఆహా!

గీ. రాయుచోఁ గట్టెనుండియు రాలు నిప్పు
ద్రవ్వుచో నీరొసంగును ధరణి యేని
శాదసాధ్య ముత్సాహుల కేది కూడఁ
దటి నొనర్ప ఫలించు యత్నంబు లెల్ల. ౧౯

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము

శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రతిజ్ఞాయౌగంధరాయణము

## ద్వితీయాంకము

(తరువాతఁ గాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుఁడు:— ఆభీరకా! ఆభీరకా! నీవు పోయి మహాసేన మహారాజుగారి మాటగాఁ బ్రతీహారరక్షకునితో నిట్లు చెప్పుము. వీరు కాశీరాజుగారి యుపాధ్యాయులు. జైవంతి నామధేయులు. దూతకృత్యంబుమీఁద నిట కేఁగుదెంచిరి. ఇమ్మహాత్మునకు సామాన్యదూతలకుం బలెఁ గాక విశేష సత్కార మొనర్చి మంచిబస చూపించుటయే గాక యీ యతిథి యాతిథేయసత్కారంబుల లెస్సగాఁ బడసితినని యనుకొనులాగొనర్పఁ బ్రయత్నించునది. — అని —

ఆహా! ఈలాగునఁ బ్రతిదినమును గోత్రానుకూలంబు లగురాజకులంబులనుండి దూత లేఁగుదెంచుచున్నారు. కాని మహాసేనమహారాజుగా రెవ్వరిని నిరాకరింపరు. ఎవ్వరిని స్వీకరింపరు. ఇది యేమిటో? ఏమి యున్నది. కన్యాదాన విషయంబున దైవమే సమర్థంబు. ఏలయన.

చ. ఎవనికి భార్య కాఁగలదో యీ మనవాసవదత్త యట్టిభూ
ధవుకడనుండి దూత నృపుదండకు రాఁడవు; లేనిచో మహీ
ధవుఁ డిటు దూతలన్ నృపకదంబము సంప వరప్రతీక్షుఁడ
య్యు వరగుణంబులన్ దెలిసియున్ వరు నేటికి నిశ్చయింపఁడో? ౨౦

ఓహో! ఇం దంతఃపురపరిచారవర్గ మందంద యొదిఁగి కొనుటం జేసి మహారాజుగా రిప్ప్రదేశంబున కరుదెంచు చున్నట్లున్నది. ఇదిగో. మహాసేనమహారాజుగారు ఈమహాను భావుఁడు.

